## విశేష 'ప్రజాదరణ' పొందిన మా ప్రచురణలు

**యర్రా సత్యనారాయణ**, *B.Sc., B.Ed.* గారి...

| | |
|---|---|
| లేటెస్ట్ జనరల్ నాలెడ్జ్ | 15/- |
| క్విజ్ పవర్ | 15/- |
| కాంజుగేషన్ ఆఫ్ వెర్బ్స్ డిక్షనరి | 16/- |
| కామన్ ఎర్రర్స్ | 15/- |
| వంటలు - పిండి వంటలు | 16/- |
| జోక్స్ వరల్డ్ | 10/- |
| ఎ డిక్షనరి ఆన్ ఎడ్జెక్టివ్స్ | 15/- |
| లెర్నర్స్ డిక్షనరి | 12/- |
| "స్పీడెక్స్" ఇంగ్లీష్ స్పీకింగ్ కోర్స్ | 15/- |
| జనప్రియ "ఆంగ్లభాష" | 15/- |
| ఆర్టికల్స్ (A, An & The) & వకాబ్యులరి | 15/- |
| స్వయం ఉపాధి (కుటీర పరిశ్రమలు) | 15/- |
| 'నవభారత్' G.K. | 10/- |
| 'ఇన్నోవేటివ్' ఇంగ్లీష్ గ్రామర్ | 14/- |

**అన్నవరపు కుమార్**, *M.A., M.Phil., B.L., P.G.D.P.R., Ph.D.* గారి....

| | |
|---|---|
| S.S.C. (క్లర్క్స్ గ్రేడ్) ప్రీవియస్ & గెస్ పేపర్స్ | 16/- |
| A.P.P.S.C. గ్రూప్-1 ప్రీవియస్ గెస్ పేపర్స్ | 16/- |
| B.S.R.B. (R.R.B.) ప్రాక్టీస్ పేపర్స్ | 25/- |
| B.S.R.B. (P.S.Bs) గెస్ పేపర్స్ | 18/- |
| ★ A.P. & ఇండియా హిస్టరీ (3,000 క్విజ్ బిట్స్) | 25/- |

**N.కరుణాకర్**, *M.A.* గారి...

| | |
|---|---|
| ★ 30 రోజులలో...ఇంగ్లీష్ నేర్చుకోండి! | 12/- |
| ★ 30 రోజులలో... ఇంగ్లీష్ గ్రామర్ | 12/- |

**P. నాగేంద్ర ప్రసాద్**, *B.Sc., B.Ed.* గారి...

| | |
|---|---|
| ఇన్ఫర్మేటివ్ ఇంగ్లీష్ గ్రామర్ | 15/- |
| A.P. హిస్టరీ స్పెషల్ క్విజ్ బిట్స్ | 12/- |
| క్విజ్ "ఇండియా" | 12/- |
| పరీక్షలు - ప్రథమ శ్రేణి | 12/- |
| A.P.P.S.C., M.P.D.O. మోడల్ పేపర్స్ & క్వశ్చన్‌బ్యాంక్ | 20/- |
| ★ చక్కని ఇంగ్లీష్ వ్రాయుట ఎలా ? | 10/- |
| ★ త్రిభాషా డిక్షనరి [illegible] | 15/- |
| ★ Learner's G.K. | 10/- |
| ★ గార్డెనింగ్ | 15/- |

**యర్రు కృష్ణార్జునరావు**, *B.Com.* గారి...

| | |
|---|---|
| లాఫీ జోక్స్ | 9/- |

**వెల్లూరి సీతారామేశ్వర రావు**, *B.Com.* గారి...

| | |
|---|---|
| ★ నాటి మానవులే - నేటి దేవతలా...! | 20/- |
| ★ పుట్టుమచ్చల శాస్త్రము | 15/- |
| ★ శరీరము - వ్యాధులు | 15/- |
| ★ రాశులను బట్టి .... మీ శృంగార జీవితం | 15/- |
| ★ "తేనె" తో చికిత్సలు | 6/- |

**శ్రీమతి Ch. శిరీష** గారి...

| | |
|---|---|
| ★ "చికెన్" తో వంటకాలు | 6/- |
| ★ "ఎగ్" తో వంటకాలు | 6/- |
| ★ "ఫిష్" తో వంటకాలు | 6/- |

**S. నాగేందర్‌నాథ్ రావు**, *M.A., B.Ed.* గారి...

| | |
|---|---|
| మెంటల్ ఎబిలిటి | 12/- |

**అడుగుల రామయాచారి**, *P.O.L.* గారి ...

| | |
|---|---|
| ★ తెలుగు పద ప్రయోగాలు (దోషములు-నివారణలు) | 15/- |
| గృహ వైద్యసారము | 10/- |
| ★ ఆయుర్వేద పానీయాలు | 10/- |

**★ స్టార్ మార్క్ ఉన్నవి స్టాక్‌లో లేవు. స్టార్ మార్క్ లేనివి మాత్రమే స్టాక్‌లో ఉన్నవి.**

Cont. ...3rd Cover

# మనో ధర్మశాస్త్రము



'భాషాప్రవీణ'

రాయప్రోలు రథాంగపాణి

జంపని-522 261




☎ 08644-23037




జనప్రియ పబ్లికేషన్స్,
అగ్నికుల క్షత్రియుల వారి వీధి-II,
గంగానమ్మపేట, తెనాలి-522 201.

# MAANAVA DHARMA SHAASTRAMU

By : Rayaprolu Rathangapani


| | |
|---|---|
| ముద్రణ : జనవరి, 1997. | Edition : January, 1997. |
| అన్ని హక్కులు: జనప్రియ పబ్లికేషన్స్, తెనాలి-వారివి. | All rights reserved by : Janapriya Publications-Tenali. |
| వెల : రూ॥ 16/- | Price : Rs. 16/- |
| ముఖ చిత్రము : ఎల్. రమేష్ బాబు, విజయవాడ-2. | Cover Design : L. Ramesh Babu, Vijayawada-2. |
| ముద్రణ : జనప్రియ ప్రింటర్స్, తెనాలి-1. | Printed at : Janapriya Printers, Tenali-1. |
| ముఖచిత్ర ముద్రణ : సోలై ప్రింటర్స్, తిరుత్తంగల్-626 130. | Cover Printers : Solai Printers, Tiruthangal-626 130. |

ప్రతులకు : For Copies :

Janapriya Publications,
Agnikula Kshatriyula vari Street-II,
Ganganammapet, T E N A L I - 522 201.

# విషయసూచిక (CONTENTS)

ఓం!

శ్రీ హనుమతేనమః!!

# చదువరులారా!

సకల చరాచర జంతుచయములో మానవుడే మాననీయుడు. చతుర్విధ పురుషార్థాలను సాధించి, పరమాత్మని చేరు దగ్గఱదారి తెలిసిన వాడితడే. కాని "యత్‌దృశ్యం తత్ నశ్యం", మన కన్నుల ఎదుట ఏది కనిపించుచున్నదో అది నశించేది. అశాశ్వతమైనది. ఏది మనకు కానరాదో అదే శాశ్వతమైనది; నశించనిది. మనము చూచే అందము, అందముకాదు; క్షణికము. చూడనిదే, అంటే చూడలేనిదే శాశ్వతానందము. ఆ ఆనందాన్ని పొందటానికి ఈ మానవజన్మ ఆధారమనే ఆలోచన వైపునకు ఏలనో మనసు పరుగిడదు. ఇదే నిత్యమని, శాశ్వతమని భ్రమిస్తుంది.

మరి మానవుడు మురిపించే ఆ భ్రమలో మనసును చిక్కుకోనీయరాదు. ప్రతి మనసుతోనూ మనసుంటుంది. అదే "అంతఃకరణము", అందఱిలో అది మూసుకొని ఉంటుంది (ముకుళిస్తుంది). కొందఱిలో వికసిస్తుంది దానినే వారు ప్రమాణముగా తీసికొంటారు. అభిజ్ఞాన శాకుంతలములో దుష్యంతునిద్వారా కాళిదాసు ఈ విషయాన్నే మనకందిస్తాడు "సంతాహి సందేహపదేషు ప్రస్తుషు ప్రమాణమంతఃకరణ ప్రవృత్తయః" అని.

కాగా, అందఱిలో ఆ వికాసాన్ని కలిగించటానికి శాస్త్రాలు వెలసినవి. మానవునకు ధర్మపథాన్ని గూర్చి వివరించినవి. కాని తెలిసినవాడననుకొనే ఈ తెలియని మనిషి వాటిని అశాస్త్రీయాలుగా భావిస్తాడు. అదే అతని దౌర్భాగ్యము. అట్టివారిని చూచి పెద్దలెంతో దిగాలుపడి ఇలా అన్నారు.

కేచితజ్ఞానతో నష్టాః కేచిన్నష్టాః ప్రమాదతః।
కేచిత్ జ్ఞానావలేపేన కేచిన్నష్టాః వినాశితాః॥

అయ్యో! ఈ మానవులెంతటి వ్యామోహములో చిక్కుకు పోతున్నారు. కొందఱు అజ్ఞానముతో నష్టపడిపోతుండగా, మఱి కొందఱు తెలిసినా ప్రమాదవశాత్తు జీవితాన్ని నష్టపఱచు కొంటున్నారు.

ఇంకొందఱు "అన్నీ తెలుసును నేనే సర్వము" అనే అహం భావముతో చెడిపోతుంటే చెడిపోయిన వారిచే చెడగొట్టబడుతూ, మరి కొందఱు నష్టపోతున్నారు. వీరందఱిని మళ్ళీ ఎలా ఒక త్రాటి పైకి తెచ్చి సత్ప్రథాన నడిపించాలి అని ఎంతగానో ఆలోచన చేశారు విశ్వశ్రేయః కాములు.

తత్ఫలితముగా వెలసిన మను, పరాశరాది స్మృతులు - మానవుని మనుగడను మరల మనకు మనసారా విప్పి చెప్పినవి. ఆ విధానాన్ని వీలైనంత వఱకు ఆచరించమని బోధించినవి. అవి జీవిత గమ్యము చేరే చక్కని రాచబాటను వేసినవి. మరెవరి ద్వారానో కాకుండా ఎవరికి వారు తమ అంతఃకరణను మేల్కొల్పుకొని, ముందుకు సాగి, ఈ లోకాన ఆనంద జలధిలో ఓలలాడి శాశ్వతానంద సాగర మధ్యానగల శేషశాయిని చేరవలసినదిగా బోధించినవి.

వానినుండి వెలార్చిన ఆ పారిజాత సుమసౌరభాల నాఘ్రాణించి, మీ మీ జీవితాలను సుమధుర రసాస్వాదనాయత్తములుగ చేసికొని పరమ పురుషునిలో లీనము కావాలని అభిలషిస్తూ....

అందుకు— 'మానవధర్మశాస్త్ర' మను ఈ చిన్ని పొత్తమును రూపొందించి, ధార్మిక హృదయులైన అఖిలాంధ్ర పాఠకమిత్రుల కర కరమలముల యందుంచితిని. నా ఈ అంతర్గత మథనమును సమాద రించి, దొసగులు దొర్లినచో తెలిపి, పదువధులు నాతో సహకరింతురని విశ్వసించుచుంటిని.

నాకు మీకు మధ్య-వారధిగా వెలసి, విలసిల్లు '**జనప్రియ పబ్లికేషన్స్, తెనాలి-522 201**' వారి పురోభివృద్ధిని కోరుతూ.... వారికి మరిన్ని ఉత్తమ గ్రంథాలను మీ కందించే శక్తిని ప్రసాదించమని ఆ పరమాత్మను స్తుతిస్తూ.... సెలవు గైకొనే....

బుధజన విధేయుడు

—రాయప్రోలు రథాంగపాణి

# మానవ ధర్మ శాస్త్రము

చిత్రమైన ఈ ప్రకృతిలో మానవుడు ఒక విచిత్రమైన బుద్ధి జీవి. ఐనా సమస్త జంతుజాలములో అస్వతంత్రుడూ ఈ మానవుడే! స్వేచ్ఛ లేని సంసార ఝంఝాటములో తగుల్కొని, మధుర భావాలతో- ఒక రమణీయమైన బంగారు సౌధాన్ని నిర్మించుకున్నాడు. అన్నిటినీ తానే పట్టుకొని, అవే తన్ను బంధించాయనుకున్నాడు. కాని నిజానికి ఆ బంగరు సంకెలలను తగిలించుకున్నది తానే! అవి సంకెలలని తెలుసు. ఐతే- సంసారముపై మోజు అతనినలా చేసినది. అదే కర్మబంధము! ఆ బంధము నుండి నిజమైన, తీయనైన అసంశత్వములోనికి తీసుకుపోయేది అతని జీవన విధానములోని ధార్మికత్వము! ఇది ఇతర ప్రాణికోటికి తెలియనిది; మానవునికి మాత్రమే తెలిసినది.

ప్రతి మానవుడూ తానొక తోలుబొమ్మను మాత్రమేననీ, తనను ఆడించే జగన్నాటక సూత్రధారి మఱొకడు కలడని గుర్తెఱిగి తనలోని కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే క్రుళ్ళను కడిగివేయాలనే తలంపుతో, తగిన ప్రయత్నము చేయాలి.

మరి మన శ్రుతులు, స్మృతులు మొదలుగాగల శాస్త్రాలు పైన పేర్కొనిన అంతఃశత్రువుల బారినుండి మానవుని తప్పించి, భగవానుని సన్నిధానానికి చేర్చేటందుకే నిత్యజీవితములో మానవుని పాత్రను వివరించినవి. ఆ వివరాల ఆధారముతో శీల సంపదను పెంపొందించుకొని ధార్మిక భావాలతో ముందుకు సాగిననాడు మానవుడు మాధవుడే. అలా కానినాడు, మానవుడు దానవుడై అధఃపతితుడగుట పరమ జీవనసత్యము.

మానవుని దినచర్య నిదుర లేచుటతో ప్రారంభమగును. ప్రభాత సమయాన మేల్కొంచుట మంచిది. ప్రభాత తెల్లవారు జాము. దీనినే బ్రాహ్మీ ముహూర్తమని అంచు తము సకల ప్రాణులకు సుప్రభాతము. ఆ సమయము దే ర్శుల సంచార సమయము కాన, ఎల్ల ప్రాణులు హా

మానసిక ప్రశాంతతను పొందగలుగును. అట్టి పరమ పవిత్ర సమయాన నిదురను వీడి, చతుర్విధ పురుషార్థములైన ధర్మ, అర్థ, కామమోక్షములను గురించిన ఆలోచన చేయుట కర్తవ్యము! ఆపై గతాన్ని (నిన్నటి రోజును) గమనిస్తూ, వర్తమానాన్ని (నేటి రోజు) భవిష్యత్తు (రేపటి రోజు) నకు తగినటుల రూపకల్పన చేయాలి. త్రికరణశుద్ధిగా, అంటే మనోవాక్కాయ కర్మలతో మంచి భావనలే చేతలుగా కావాలని ఆలోచిస్తూ దైవాన్ని ధ్యానించాలి!

## ప్రాతఃకాల దైవ ధ్యానము

అహల్యా ద్రౌపదీ సీతా తారా మండోదరీ తథా।
పంచకన్యాః పఠేనిత్యం మహాపాతక నాశనం॥
పుణ్యశ్లోకో నలోరాజా పుణ్యశ్లోకో యుధిష్ఠరః।
పుణ్యశ్లోకో విదేహశ్చ పుణ్యశ్లోకో జనార్దనః;
కర్కోటకస్య నాగస్య దమయంత్యాః నలస్య చ
ఋతుపర్ణస్య రాజర్షోః కీర్తనం కలినాశనం॥
అశ్వత్థామా బలిర్వ్యాసో హనుమాంశ్చ విభీషణః।
కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః॥

బ్రహ్మమురారి త్రిపురాంతకోగ్నిర్భాను శ్శశీ భూమిసుతో బుధశ్చ,
గురుశ్చ శుక్రశ్శని రాహుకేతవః కుర్వంతు సర్వే మమ సుప్రభాతం॥
భృగు ర్వశిష్టః క్రతురంగిరోశ్చ మనుః పులస్త్యఃపులహశ్చ గౌతమః।
రైభ్యో మరీచి స్తపనోహి దక్షః కుర్వంతు సర్వేమమ సుప్రభాతం॥
పృథ్వీ సగంధా సరసాస్తథాపః స్వర్శాశ్చ వాయుః జ్వలనం చ తేజః।
నభశ్చ సశబ్ద మనోరథైశ్చ కుర్వంతు సర్వేమమ సుప్రభాతం॥

అటు తరువాత తన అరచేతిని చూచుచూ

కరాగ్రే వసతే లక్ష్మి కరమధ్యే సరస్వతీ।
కరమూలేతు గౌరీ చ ప్రభాతే కరదర్శనం॥

ఈ శ్లోకము పఠించాలి.

ఇక, తన మనుగడకు మూలమైన భూమిపై మొదటి పాదము మోపేముందు భూమాతను చేతులతో తాకి;

సముద్రవసనే దేవి పర్వతస్తనమండలే।
విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే॥

అంటూ తన పాదస్పర్శకు క్షమాభిక్ష కోరాలి. ఆ పై, మంచము నుండి దిగి, ఆరాధనీయులను తలచుకొని, చూచి నమస్కరించి కాల కృత్యములు తీర్చుకోవాలి.

పగలు, సంధ్యాసమయాలలో ఉత్తరాభి ముఖముగానూ, రాత్రు లలో దక్షిణాభిముఖముగానూ-మల-మూత్ర విసర్జన చేయాలి. ఆ సమ యాన మౌనముగా ఉండాలి. సూర్యచంద్రుల కెదురుగా చేయరాదు. నలుగురు నడిచేచోట, దేవాలయ ప్రాంగణాలలో, నీటిలో, తోటలలో మలమూత్రవిసర్జన చేయతగదు. అనంతరము నీటితో చేతులను, కాళ్ళను పరిశుభ్రము చేసికోవాలి. పరిసరాల పరిశుభ్రతకై ఊరిబయట ఈ క్రియ జరగాలి.

**దంతధావనము (పండ్లు తోముకొనుట) :-** ఒకచోట కూర్చొని పండ్లను శుభ్రపఱచుకోవాలి. నడుస్తూ, నిలబడి దంతధావన చేయుట శాస్త్ర నిషేధము. సూర్యచంద్రుల కెదురుగా పనికిరాదు. నిన్నటి ఆహారపదార్థాల "లవలేశాలు" పండ్లయందు చిక్కుకొని, నోరు దుర్వా సన వచ్చును. అట్టి దుర్గంధపూరితమైన నోటితో పరమ పవిత్రమైన వాఙ్మయ వ్యాసంగము చేయుట తగనిపని. కాన, ప్రతిదినము ఒకసారైనా పరిశుభ్రము చేయాలి. ప్రతి ఆహార స్వీకారానంతరము నోటిలో నీళ్ళు పోసుకొని ఉమియుట ఉత్తమము. దంతధావనానంతరము నాలుకపై పేరుకొన్న పాచిని తొలగించాలి. ఉత్తరము, తూర్పు దిక్కులుగ కూర్చొ నాలి. అంతేగాని, అటనట తిరుగుచు, ఉమియుచు, మాటలాడుచు దంత ధావన చేయతగదు. ఆ ఉమ్మిలో విషకణాలున్నందున వాటిపై ఈగలు మొదలగునవి ప్రాలి, అవి తిరిగి మన దేహముపై ప్రాలినందున అందుండి అనారోగ్యకర సూక్ష్మజీవులు మన దేహములో చేరి, రోగ బాధలను కలిగించును.

ఈ క్రింది శ్లోకము పఠించి దంతధావన చేయాలని శాస్త్రము చెబుతున్నది.

ఆయుర్బలం యశోవర్చః ప్రజాః పశువశూని చ।
బ్రహ్మప్రజ్ఞాం మేథాంచ త్వన్నో దేహి వనస్పతే॥

నవరంధ్రాలతో నిరంతరమ్ము దుర్గంధపూరితమైన ఈ దేహము పవిత్రము కావాలంటే ప్రతి క్షణము శుభ్రము చేస్తూ ఉండాలి. దైనందిన కార్యకలాపాలు స్నానముచేసే చేయాలి. స్నానముతో దేహము పవిత్రమౌతుంది. స్నానము చేయక చేసిన సత్కర్మలు నిష్ఫలము. దేహము పుష్టిగా ఉండాలంటే- శారీరక, మానసిక ఆరోగ్యాలు, ధైర్యము, చిరజీవిత్వము, కాంతి, తేజస్సు, రూపము పెరగాలంటే- స్నానము తప్పనిసరి. ప్రభాత స్నానము ఉత్తమోత్తమము. ఆ సమయములో నీటిలో ఆరోగ్య భాగ్యాన్నందించే ధాతువులు, జీవకణాలు ఉంటవి! అవి ఈ శరీరాన్ని తాకగానే నూతనోత్సాహము వెల్లివిరుస్తుంది. అంతేకాక, సూర్యశక్తి నీటిలో ఉంటుంది. "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అని కదా శాస్త్రము! ఆరోగ్య కారకుడు సూర్యుడు. అతని చూపులు స్నానము చేసే వానిపై ప్రసరిస్తవి. మౌనముగా ఎక్కువసేపు స్నానము చేయాలి. పురుషుడు దిగంబరుడై స్నానము చేయరాదు. సర్వకాలాల్లో చన్నీటిస్నానము ఆచరణీయము. ఆ స్నానము నదులలో చేయుట ఉత్తమము. తటాకాన మధ్యమము. బావినీట సామాన్యము, భాండ స్నానము పనికిరాదని పెద్దలు చెప్తారు. ఐతే ఏ స్నానానికైనాముందు నువ్వులనూనె వ్రాసుకొని, వ్యాయామము చేసి, ఆపై స్నానము చేయుట మంచిదంటుంది ఆయుర్వేదము.

ప్రభాతానచేసే స్నానము ఋషి స్నానముగా, సూర్యోదయానికి పూర్వము చేస్తే దైవస్నానముగా పేర్కొన్నారు ఆపై చేసే స్నానము అంత విలువైనదిగా పెద్దలు చెప్పలేదు. నదులలో స్నానము చేసేటప్పుడు ప్రవాహానుకూలముగా స్త్రీలు, ఎదురుగా పురుషులు చేయాలి.

ఇక, సముద్రస్నానము పర్వదినాలలో మాత్రమే చేయాలి. సముద్రస్నానానికి ముందు, తర్వాత చన్నీటి స్నానము తప్పక చేయాలి. ఎక్కువసేపు సముద్ర జలాలలో ఉండతగదు.

మన పెద్దలు స్నానాలను అనేక రకాలుగా విభజించారు. అందు ముఖ్యముగా మూడింటిని మనము తెలిసికోవాలి. అవి అభ్యంగన, అవభృథ, అఘమర్షణములు. అభ్యంగనము అంటే తలంటు. ప్రతివారు వారాని కొకసారైనా ఈ స్నానము చేయాలి! శిరస్సున నువ్వుల నూనెను మర్దించి, తర్వాత శరీరానికి పూసి, అటులే మర్దించి, తరువాత- సీకాయ, కుంకుడుకాయ మొదలగు వానితో రుద్దుకొనుటవలన శరీరము పరిశుభ్రముగా, కాంతివంతముగా వెలుగొందుతుంది. ఏవేని కామ్యకర్మల నాచరించి, ఆ దీక్షానంతరము చేసే స్నానము అవభృథము. ఇక శరీరాన్ని తడిపి పిండిన వస్త్రముతో శరీర పరిశుభ్రతను పొందుట అఘమర్షణ. ఇది జ్ఞాన విజ్ఞాన వికాసాలకు నిలయము. ఈ స్నానాలలో అత్తరు, పన్నీరులు కలిపి చేసే స్నానాన్ని "భోగము" అంటారు.

గంగాగంగేతి యో బ్రూయాత్ యోజనానాం శతైరపి
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం సగచ్ఛతి॥
నందినీ నలినీ సీతా మాలినీ చ మహాపగా।
విష్ణుపాదాబ్జసంభూతా గంగా త్రిపథగామినీ॥
భాగీరథీ భోగవతీ జాహ్నవీ త్రిదివేశ్వరీ।
ద్వాదశైతాని నామాని యత్రయత్ర జలాశయే॥
స్నానకాలే పఠేన్నిత్యం మహాపాతక నాశనం॥

కూపోదకాలలో, నదీనదాలలో, సముద్ర జలాలలో జలకాలాడే సమయాన ఇది ప్రశస్త పఠనము! స్నానము చేస్తూ ఈ శ్లోకాలనుచ్చైస్స్వరముతో నుచ్చరించిన శుభాలుగలుగునని శాస్త్రకారుల శాసనము.

స్నానానంతరము తడి వస్త్రముతో ఎక్కువసేపు వుండరాదు. అటులున్న దిగంబరతతో సమానము. శరీరాన్ని మఱొక వస్త్రముతో తుడవాలి. అంతేగాని.... ఒట్టి చేతితో తుడిచి, గాలికి ఆరునట్లుగా చేరాదు తెల్లని వస్త్రధారణ శాంతికి, జ్ఞానానికి సంకేతము. కాన

వస్త్రములను ధరించుటే శుభము. కాగా, విడిచిన వస్త్రమును గాని, మరొకరు విడిచిన దానిని గాని అంటరాదు. ఉతికిన దానినే ధరించవలెను. కనుబొమల నడుమ జ్ఞాననేత్రము ఉంటుందంటారు. అందుకే అచ్చాదనగ అచట తిలకధారణ లేదా కుంకుమ, గంగ, సిందూర ధారణలు చేస్తారు. నొసటి వ్రాతలోని చెడును తొలగించుకొనుటకే విభూతిధారణ! విభూతిని నీటితో తడిపి చేతులలో నుంచి "విభూతి భూతికరిలలాట లిఖితాని దురక్షరాణి లూపతి" అంటూ నుదుట వ్రానికోవాలి,

ఇష్టదేవతారాధనచేసి, నివేదనను తీర్థముగా, ప్రసాదముగా తీసికోవాలి. తనవారితో కలసి భుజించాలిగాని, ఒంటరిగా తినరాదు. అతిధులకు, అనాథలకు దానము చేయాలి. ఎందుకంటే, కలియుగాన దానమును మించిన సత్క్రియ మరొకటి లేదని పరాశర స్మృతి చెబుతున్నది. ఉత్తరదిక్కు భోజనము పనికిరాదు, తల్లిదండ్రులను, అతిథులను పెద్దలను గౌరవభావముతో చూడాలి.

ఇక, మానవుడు సంఘజీవి. సంఘమును కాదని జీవించాలనుకొనుట నేలవిడిచి సాముచేయుటే. కాన, గృహస్థు తన ధర్మముల నాచరించుచునే సంఘజీవియై సత్పౌరుడుగా జీవనయానము సాగించాలి. ఇహపరాలలో తనదైన ఒక చక్కని బాటను వేసికొనగలుగుట మానవుని చేతిలోనే ఉన్నది. ఈ విధమైన జీవనవిధానము పూర్తి చేసి భగవత్ స్మరణతో నాటి కార్యక్రమాన్ని ముగించి, ఆ లీలామానుష విగ్రహుని తెలిసియో, తెలియకనో చేసిన అపరాధముల క్షమించుమని కోరుతూ నిద్ర కుపక్రమించాలి. ఆ శ్లోకము ఇది-

ఆత్మాత్వం గిరిజామతిః పరిజనాః ప్రాణాః శరీరం గృహం।
పూజాతే విషయోపభోగ రచనా నిద్రా సమాధిస్థితిః॥
సంచారః పదయోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణి సర్వాగిరో।
యద్యత్ కర్మకరోమి తత్తదఖిలం శంభో తవారాధనం॥
అనాయాసేన మరణం వినా దైన్యేన జీవనం।
దేహాంతే తవ సాయుజ్యం దేహిమె పరమేశ్వర॥.

ఇదంతా మానవుని సదాచారవంతునిగ చేయు విధానము! "ఒక్క సదాచారసంపన్నుడే ఏ ఇతర లక్షణాలు లేకున్న- నూఱు సంవత్సరములు జీవించి, ఇహపర సుఖములను పొందగలడ"ంటాడు- మనువు! అలాగే పరాశరుడును- "సదాచారము చాతుర్వర్ణముల వారికి ధర్మపాలనము! అది తెలియనివాడు అధోగతుడు"అంటాడు.కాబట్టి ... ధర్మబోధకమైన మరికొన్నింటిని వివరముగా తెలిసికొందాము! కవికుల తిలకుడైన కాళిదాసు రఘువంశ రాజులను వర్ణిస్తూ....

"శైశవేభ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణాం ।
వార్ధకే మునివృత్తీనాం యోగేనాంతే తనుత్యజాం" అంటాడు.

అంటే .. కాళిదాస కవీంద్రుడు ఈ శ్లోకము ద్వారా మానవుడు ఆయా కాలాలలో ఆచరించవలసిన ధర్మాలను అల్పార్థాలతో అనల్పమైన ధార్మికబోధ కావించినట్లుగా మనము చెప్పుకోవచ్చు. .ఎలాగంటే....

మానవునకు "బాల్య, యౌవన,కౌమార, వార్ధక్యముల"ని నాలుగు అవస్థలు! కాగా.... ఆయుఃపరిమాణము నూఱు సంవత్సరాలు! నూఱు సంవత్సరాల జీవనము సాగించిన వానిని "పూర్ణపురుషాయుష జీవి"అని అంటారు. యౌవన, కౌమార, వార్ధక్యాలలో అతని మనుగడకు బాల్యమే పునాది. కాబట్టి.... ఈ దశలో పెద్దలు కడుజాగరూకులై తమ బిడ్డలను అదృష్టవంతమైన బతుకును పొందునటుల తీర్చిదిద్దాలి. 'మార్జాల కిశోర న్యాయము'గా బాల్యదశను పట్టుకురావా లన్నమాట. బాల్యాన విజ్ఞాన వికాసాలకు మూలమైన విద్య నభ్యసించాలి. ఆ విద్య ఇహ-పరచింతనావృతమై ఉండాలి. ఈ లోకములో ఉంటూనే పారలౌకిక జ్ఞానాన్నికూడా అభ్యసించాలి. ఆలోచిస్తే....బాల్యదశ మనిషికి కత్తి అంచుపైన నడక అనవచ్చు. మరి ఎంతో విలువైన ఆ కాలములో- వెలలేని, తేజోవంతమైన విద్యనెలా అభ్యాసము చేయాలని మన శాస్త్రాలు చెబుతున్నవో చూడండి!

"విద్యాం అర్థయతీతి విద్యార్థి" అని అనగా విద్యకోరువాడు. బాల్యము విద్యార్థిదశ గదా! కఠోరనియమాలకు బద్ధుడై, గురుని సమ్ముఖాన అభ్యసించాలి. విద్యార్థి విద్యారంభాన, తదనంతరము గురువును దేవునిగా భావించాలి. అయనపైన నమ్మక ముండాలి. గురువులేని వి

సత్ఫలితాల నీయదు. గురువు ఎదుట- చేతుల నొకచోట చేర్చి, వినయ-విధేయత లుట్టిపడునట్లు కూర్చోవాలి. అదే- 'బ్రహ్మాంజలి'. విద్యాబుద్ధులు కోరువానికి- శారీరక, మానసిక ప్రశాంతతలు అవసరము! ముఖ్యముగా విద్యా సముపార్జనకు- ముందు పరుగులుతీసే మనస్సును, ఇంద్రియాలను ఏ ఆలోచనలవైపునకు పోనీయక.... ఒకచోట నిలిపి ఉంచాలి. అదే ఏకాగ్రత! ఏకాగ్రత లేవినాడు- బుద్ధి ప్రజ్ఞను పొందలేదు. "ప్రజ్ఞ" అంటే భూత, భవిష్యత్, వర్తమానములను గమనించే బుద్ధి విశేషము! అట్టి ప్రజ్ఞాపాటవాలను కలిగించే విద్యను పొందాలంటే- వడిగల గుఱ్ఱాలను మించిన ఇంద్రియాలను ఒకచోట నిలబడునట్లు చేయాలి. అట్లు చేయుటకు అభ్యాసము అవసరము! అందుకే మన పెద్దలు "అభ్యాసము కూసువిద్య" అన్నారు. ప్రజాకవి వేమన "సాధనమున పనులు సమకూరు ధరలోన" అంటాడు.

ఆ సాధనాభ్యాసాలకు మూలము ప్రాణాయామము! అనగా.... ఉచ్ఛ్వాసనిశ్వాసాలుగా (గాలి పీల్చుట, వదలుట) సాగే శ్వాసక్రియను క్రమబద్ధీకరించుట! నిదానముగా గాలిని లోనికి పీల్చుట. పీల్చిన గాలిని నిదానముగా వదలుట. ఇక ఇంద్రియాలు మొత్తము పదకొండుగా పెద్దలు నిర్ణయించారు."త్వక్ చక్షుశ్శ్రోత్రు జిహ్వా ఘ్రాణములు అనగా.... చర్మము, కనులు, చెవులు, నాలుక, ముక్కు. ఈ ఐదు జ్ఞానేంద్రియాలుగా పిలువబడుతున్నాయి. వాక్పాణి పాదపాయూపస్థలు- వాక్కు, చేయి, కాలు, లింగము, గుదము, ఈ ఐదూ కర్మేంద్రియాలుగా చెప్పబడుతున్నాయి. ఈ పదింటిని తన అధీనములో ఉంచుకొనే మరో ముఖ్యమైన ఇంద్రియము- మనస్సు. ఈ పదకొండింటిని-నేర్పరియైన రౌతు ఎలాగైతే తనగుఱ్ఱాన్ని స్వాధీనములో నుంచుకొంటాడో....అలా తన చెప్పుచేతలలో మెలగేలా ఉంచుకోవాలి. అలాకాక....ఆ ఇంద్రియాలకు తాను లోలుడై ఉంటే ఇక చెప్పేదేమున్నది. నడిపింప నేరని రౌతు అధీనములో- మిట్ట పల్లాలలోనికి, గోతులలోనికి లాగుకొనిపోయి ముప్పుతిప్పలు పెట్టి, కష్టాల పాల్జేసిన స్వేచ్ఛాశ్వముల వలె.... ఇంద్రియ వశుని జీవితము నరక ప్రాయమే కాగలదు.

కాన ... "మొక్కై వంగనిది మ్రానై వంగునా" అన్న చందముగా ఇంద్రియ సమూహాన్ని విద్యార్థి దశలోనే మానవుడు తన స్వాధీనము లోనికి తెచ్చుకోవాలి."ధర్మార్థ కామమోక్షాల"నే చతుర్విధ పురుషార్థాలను సాధించటానికి సాధనముగా ఇంద్రియాలను లోబరచుకొని తన భావి జీవితానికి చక్కని బాట వేసికొని, జీవన మకరందమైన ఆనందాన్ని పొందాలంటే ...ఇంద్రియ జయత్వము అత్యంతావశ్యకము.

కాగా.... ప్రాణాయామాది సాధనాభ్యాసాలు విద్యార్థి కెంత అవ సరమో, గురుశుశ్రూష అంతే అవసరము! గురు సన్నిధానములో- గురువుగారి ఆసనాన్ని మించిన ఆసనముపైన కూర్చోరాదు. వేషము తగినదై ఉండాలి. షడ్రసోపేతమైన భోజనానికి ఆరాటపడరాదు. గురువు కంటే ముందే మేలుకోవాలి. గురువు శయనించిన తరువాతనే శయ నించాలి. కూర్చొని, తినుచూ, వీపు చూపించుచూ సమాధానాలు చెప్ప రాదు. కూర్చున్న గురువు ఎదుట నిలబడాలి. నిలబడి ఉన్న గురువు ఎదుట వినయముగా నిలబడాలి· వచ్చే గురుస్వామికి ఎదురేగి, స్వాగతము పలకాలి. దూరముగా ఉన్న గురువును సంబోధించి సమాధానము చెప్ప రాదు. దరిచేరి మాత్రమే చెప్పాలి. గురునింద చేయరాదు. వినరాదు.

ఆలోచించిన.... జన్మనిచ్చిన తండ్రికన్న విద్యాదానము చేసిన గురువే గొప్ప. తన శక్తితో అజ్ఞానమనే నివురును తొలగించి, విద్యార్థిలో నివురు గప్పిన నిప్పులా ఉన్న విజ్ఞానమును వికసింపచేయు సుహనీయుడు గాన...."గురుదేవుడ"న్నారు. గురూపదేశము పొందనేరనివాడు- మోక్ష మునుపొందలేడు. శాశ్వతానంద సంధాయకమైన పరలోకాన్ని చేరు బాట చూపువాడు గురువే!

మానవునికి చర్మచక్షువులు. (పైకి కనిపించే కనులు)కాక....ప్రతి వానికి మరో కన్ను ఉంటుంది. అదే జ్ఞాననేత్రము. ఇది "అంతచ్చక్షువు" అని పిలువబడుతుంది. ఇది అందరికీ పనిచేయదు· ముకుళించుకుపోయి ఉంటుంది. అది వికసించాలంటే....

"అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః।
చత్వారితస్య వర్ధంతే ఆయుర్విద్యా యశోబలమ్॥"

ప్రతినిత్యము- పెద్దలను సేవించాలి. వారికి నమస్కరించాలి. "నమస్కారము"నగా "అయ్యా!మీరు నాకంటే-వయసులోను,జ్ఞానము లోను పెద్దలు, నేను మీకంటే అన్నింటా అల్పుడను" అనే భావనతో రెండు చేతులను జోడించుట. అట్టి వానికి ఆయువు, విద్య, యశస్సు, బలము సమకూరును. గురుసేవ, తల్లిదండ్రుల సేవ, మనోనేత్రము వికసించుటకు మూలమని వేదము చెబుతోంది, అంతేకాక....తాను పయనించునపుడు వాహనారూఢులు, వృద్ధులు, రోగులు, తలపై బరువుకలవారు, అధికారులు, పెళ్ళివారు ఎదురైతే దారి యివ్వాలి.

ఇక .. బాల్య దశలో- విద్యార్థిగా నున్న తరి- మంచి స్నేహితుల నెన్నుకోవాలి. ఎందుకంటే....గురువుగారు చెప్పినదంతా ఒంటబట్టదు. అందువలన గురువుగారి వలన కొంత, తాను చేసే మననధారణల వలన కొంత, మరికొంత స్నేహితులు చదువునప్పుడు వినుటవలన, ఇంకా కాలక్రమాన వచ్చు అనుభవాన విజ్ఞానాన్ని పొందును. కాన.... మంచి వానితో స్నేహము చేయాలి. చిన్ననాటి స్నేహము మఱచిపోలేనిది. పెరిగి పెద్దవాడైన తరువాత సంఘ జీవన మనివార్యము కాన, సంఘములో స్నేహాన్ని మించిన మరో సంపద లేదు. మంచి దోస్తులు లేనివాడే దురదృష్టవంతుడు!

ఎట్టి గురువును సేవించాలో కొంత తెలిసికొందాము. ధనకాంక్ష లేనివాడు, స్వార్థము తెలియనివాడు, వేదము చదివినవాడు, సన్మార్గము నందు ఉండునట్లు చేయగలవాడు, నిరాడంబరుడు; తాను జ్ఞానవంతుడై, దగ్గఱకు చేరిన వారిని జ్ఞానులుగ చేయగలవాడు మాత్రమే నిజమైన గురువు! డాంబికుడు గురువు కాబోడు.

ఇక :... పెద్దల ఎడ, బంధువుల ఎడ ప్రవర్తించ వలసిన విధానము ంత పరిశీలిద్దాము.

సామాన్యముగా పెద్దలను. "మీరు", "తమరు" అను బహు వచనాలతో పిలవాలే గాని ... పేరు పెట్టి పిలవరాదు. పెద్దలకు నమ

స్కరించాలి. ఎవరో తెలియని స్త్రీలను- "గౌరవనీయురాలా!" "సోదరీ" అని పలుకరించాలి. తల్లి, తోబుట్టువు, మేనత్త, మేనమామ, భార్య వీరంతా గౌరవింప దగినవారు! పరిచయము లేని వారితో మాట్లాడవలసి వస్తే ముందు తన పేరు, తల్లిదండ్రుల పేర్లు చెప్పాలి. తల్లి, తండ్రి, గురువులను గౌరవించక- దైవాన్ని ధ్యానించినా ఫలితము సున్నా! జీవన యాత్ర సాగించాలంటే ధనమే మూలము. కాబట్టి మానవుడు "క్షణశః కణశశ్చైవ విద్యామర్థం చ సాధయేత్". "ప్రతిక్షణము విద్యను, ధన మును సంపాదించాలి" అని అంటుంది ధర్మశాస్త్రము!

అంతేకాక... బాల్యము నుండి ద్రోహబుద్ధిని వీడాలి. ఓర్పు, నేర్పు లను అలవరచుకోవాలి. సత్యమును పలుకుచు- మధురమైన మాటకారి తనాన్ని సంపాదించాలి. అంటే.... వినసొంపుగా మాట్లాడాలి. అపకారికైనా ఉపకారము చేయాలి. అగరువత్తిలా తానెంత కుములుతున్నా....ఇరుగు-పొరుగు వారికి అమృత హస్తాన్నందించాలి. పరుల ధనమునకు, సంపదకు, విద్యకు అసూయపడరాదు. అసహ్య భావన లేకుండా, ప్రశాంత ముగా, దైవ స్వరూపముగా భావించి, భగవానునికి నివేదించిన ఆహారాన్ని తీసికోవాలి. తాను తినగా మిగిలిన ఆహారాన్ని ఎవరికీ పెట్టరాదు. దాచి వుంచి తరువాత తానైనా తినరాదు. హిత-మితాలు అవసరము. ఒకచోట కూర్చొని తినాలి. తూర్పు ముఖముగా కూర్చొనితింటే ...ఆయుష్షు పెరుగు తుంది. దక్షిణ ముఖముగానైతే-కీర్తి, పశ్చిమముగా-సంపద, ఉత్తరముగా నైతే సత్యవాక్పాలనము కలుగుతాయి. "అన్నము పరబ్రహ్మ స్వరూపము" అని గదా పెద్దలమాట!

మానవుడు- గురుశుశ్రూషతో, పెద్దల సేవతో, సజ్జన స్నేహ ముతో, నిత్యము తాను తిరిగే పరిసరాల అనుభవాలతో- జ్ఞానాన్ని సంపా దించాలి.

మానవుని రెండు, మూడు దశలు- యౌవన, కౌమారాలు! కాలా లలో-వసంతకాలము ఎంత మధురమైనదో... మనిషికి ఈ దశలు అంత మధురమైనవి. అందము, ఆనందము కలబోసిన జీవన మకరందము జాలువారే మఱపురాని మధురస్మృతులుగ నిలచే రోజులివి!

ఎదిగిన మనసుతో సంఘజీవనములో తన బ్రతుకునకొక స్థిరత్వమును సంపాదించిన తరువాత వివాహమాడాలి. మానవుని జీవితములో ఈ వివాహము ఒక విచిత్రమైన మలుపు!ఎందుకంటే....అంతవఱకు ఎచటనో పుట్టి, మరెచటనో పెరిగిన ఇరువురు - ఈ వివాహబంధముతో ఒకటై, శుభజీవనము సాగిస్తారు గనుక! మానవ జీవితము ఎప్పుడూ సరిక్రొత్త విధానాలతో కూడి ఉండుట సృష్టిలోని రహస్యము.

కాగా, గృహస్థై, తన వంశాన్ని- ఈ జగాన పెంపొందింప చేయాలి. ఈ లోకములో తమ వంశము ఎలా పెరుగుతుందోనని వేయి కళ్ళతో పైనుంచి పితృదేవతలు నిత్యము చూస్తుంటారని మన శాస్త్రాలు చెబుతున్నాయి. ఎందుకంటే.... ఆ పితృదేవతలు ఈ లోకములో తమ వంశము ఎంతకాలము ఉంటే.... అంతకాలము ఉంటారు. లేకపోతే "క్షీణేపుణ్యే మర్త్యలోకమ్ విశంతి" ఈ అవనిపైన వంశము ఉంటేనే వారికి పుణ్యము దక్కుతుంది. వంశక్షయము- పితృదేవతలకు పుణ్య క్షయము. అపుడు వారు జన్మనెత్తుటకై ఈ లోకానికి రావలసినదేనట. వంశాభివృద్ధికై ఏర్పడినదే మన ఈ వివాహ వ్యవస్థ! కాబట్టి....యౌవన ములో గృహస్థుడగుటకు మూలమైన వివాహాన్ని గురించి ముందుగా తెలిసికొందాము.

తండ్రి వంశానికి చెందిన కన్యతో వియ్యమందరాదు. తల్లి వంశము, ఇంకా ఇతర వంశాలూ, పనికివస్తాయి. ఐతే ...."కపిలవర్ణము గలదానిని, తన కన్న పొడుగైన దానిని, రోగాలు గల దానిని, రోమాలు లేని దానిని, దేహ భాగాలలో అధికముగా రోమాలు గల దానిని, అనవసరముగా మాట్లాడే దానిని, దుష్ట స్వభావము కల దానిని, తల్లిదండ్రులను బోలి ఉండని దానిని, మగరూపు గల దానిని తన కన్న ఎక్కువ వయసు గల దానిని వివాహమాడరాద"ని మన శాస్త్రాలు అంటున్నాయి. ఇంకా....నక్షత్రాల పేర్లు, చెట్ల పేర్లు, సర్పాదుల పేర్లుగల కన్నియ కూడ పనికిరాదు.

"అందమైన పేరుగలది, చక్కని అవయవ సౌష్ఠవము గలది, హంసలా, ఏనుగులా నడిచేది; మృదువైన రోమాలు గలది; తక్కువ,

ఎక్కువ లేక తగిన రోమాలు గలది; వజ్రాలవంటి పలువరుస గలది, చక్కగా మధురముగా మాటలాడునది, మృదువైన అంగాలు కలది, సన్నని నడుము గలది, వియ్య మందదగిన కన్నియ" అన్నారు- అనుభవజ్ఞులు. అంతేకాక-తల్లిని క్షేత్రముగా, తండ్రిని బీజముగా భావించుట లోక ప్రసిద్ధి! క్షేత్రము సుక్షేత్రముగా విరాజిల్లాలంటే- కన్య సులక్షణ సంపన్నగా భాసించాలి. కాన అట్టి కన్య వివాహ యోగ్య!

అట్లే మంచి కులములో పుట్టినవాడు, శీల సంపన్నుడు, తగిన వయస్సు గలవాడు, అందగాడు, చదువు, సంస్కారము, సంపాదన కలిగి; 'నేను "సమర్థుడ"ను అనే నమ్మకము గలవాడుగ వరుడుండాలి.

అందుకే....ఇవన్నీ చక్కగా ఆలోచించి వివాహాలు చేయాలి. వివాహములో తొందర పనికిరాదు.తొందరగా పెళ్ళిచేసికొంటే.... తీరికగా కూర్చొని ఏడవాలి. కాన....నిదానముగా ఆలోచించే చేయాలి. రెండు తరాల తత్వాలు తెలుసుకోటానికి ఏడుజతల చెప్పులు అరిగి పోయేటట్లు తిరిగే వారట మన పూర్వులు. పెళ్ళి నూరేళ్ళపంట గదా మరి! వివాహాలు- "బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, అసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచము" అని ఎనిమిది విధాలు.

**1] బ్రహ్మ వివాహము :** చదువు, సంస్కారము గల యోగ్యుడైన వరుని స్వయముగా పిలచి; అలంకరించి, విధి విధానముగా కన్యాదానము చేయుట.

**2] దైవ వివాహము :** యజ్ఞమున ఋత్విజుడై కర్మ చేయు వానికి సాలంకృత సహిరణ్యక కన్యాదానము చేయుట.

**3] ఆర్ష వివాహము :** ధర్మకార్య నిర్వహణార్థము వ. నుండి గోమిథునాన్ని స్వీకరించి కన్య నిచ్చుట

**4] ప్రజాపత్యము :** "మీ రిద్దఱు కూడి ధర్మమాచరింపుడి అని చెప్పుచూ కన్యనిచ్చుట.

**5] ఆసుర వివాహము :** ధనమును పుచ్చు! నిచ్చుట,

6] గాంధర్వ వివాహము : వధూవరులు ప్రేమికులై, పరస్పరము ఒక ఒడంబడికను కుదుర్చుకొని చేసికొనునది

7] రాక్షస వివాహము : యుద్ధాదులచే- కన్యకు సంబంధించిన వారి నెదిరించి, బలత్కారముగ గ్రహించుట.

8] పైశాచ వివాహము : నిద్రించు దానిని, స్పృహలేని దానిని హరించుట.

ఈ ఎనిమిది వివాహాలలో బ్రాహ్మణునకు బ్రహ్మ, దైవ వివాహాలు; క్షత్రియునికి గాంధర్వ, రాక్షసాలు ప్రసస్తాలు! కాగా పైశాచము అధమాధమమూ, నింద్యమూను!!

బ్రహ్మ, దైవ, అర్ష, ప్రాజాపత్యాల సంతతి- తేజోవంతులుగ, సత్త్వగుణము గలవారుగ, ధనవంతులై, కీర్తి వంతులై, సకలభోగాల ననుభవిస్తారు. నూఱు సంవత్సరాలు జీవిస్తారు. మిగిలిన నాలుగు సంఘ వ్యతిరేక శక్తులకు నిలయాలుగా నిలిచిపోవును.

కాగా... ఇక దాంపత్య జీవన విధానముపైన మన మహాత్ములు చెప్పిన అభిప్రాయాలు, ధర్మాలు ఇలా ఉన్నవి.

ఋతు ధర్మము నుండి పదహారు రోజులను ఋతుకాలముగా చెప్తారు. ఆ సమయములో మొదటి నాలుగురోజులు త్యాజ్యాలు ఏకాదశి, త్రయోదశి గూడా నిషిద్ధాలే. ఇక ఈ ఆరురోజులు పోగా.... మిగిలిన "పదిరోజులు ప్రశస్తమైనవ"ని అనుభవజ్ఞులు చెప్తారు. అంతేకాక, పుత్ర సంతానాన్ని కోరేవాడు సరిరోజులలో ఋతుస్నాతయైన భార్యా సంగమము సాగించాలి. శుక్ల శోణితాలలో.. శుక్ల మధికమైన-పురుషుడు, శోణితమధికమైన- స్త్రీ జనించుట జరుగును. ఏ మానవుడు కామశాస్త్ర విధానముగా రతిక్రీడ జరుపునో.... వాడు బ్రహ్మచారిగా భావింపబడును.

"ఋతు ధర్మము నొందిన భార్య సమీపమున నుండగా.... ఆమెతో రమింపనివాడు మహాపాపి" అంటుంది పరాశరస్మృతి!

అటులే...."ఋతుస్నాతయై, భర్త పిలచినా దరిచేరని భార్య మరణానంతరము నరకకూపానబడి, జన్మజన్మల వైధవ్యము పొందుతుంద"ని కూడా అంటాడు పరాశరుడు!

భార్యాభర్తలు అన్యోన్యానురాగాలతో మమతాను బంధాలను పెంచుకోవాలి. ఏ ఇంట స్త్రీ సంతోషముగా, ప్రశాంతముగా భర్తను చూడదో.... ఆ ఇంట కళకళలాడే సంతానము కానరాదు. సరిగదా.... సంతానము అసలుండదు"గృహము"అంటే.... తలుపులు, ద్వారబంధాలు, కిటికీలు కాదు.... ఇల్లాలే! కాన....ఇల్లాలి ఆనందమే ఇంటికి వెలుగు!

ఏ స్త్రీ తన భర్తను "దరిద్రుడు, రోగి, మూర్ఖుడు" అని చుల్కన చేయునో.... ఆ స్త్రీ మరణానంతరము- శునకముగాను, సూకరముగాను పలుమారులు పుట్టును. అంతేకాదు....స్త్రీ తన భర్తను లెక్క చేయక, అతనిని గౌరవింపక, ఆ భర్త అనుమతిలేక- ఎన్ని వ్రతాలు ఆచరించినా, ఎన్ని ఉపవాసాలు చేసినా అవన్నీ నిష్ఫలాలే! పైగా.... అవి దేవతలను చేరవు. అవన్నీ రాక్షసుల దగ్గఱకి పోవును.

ఇక గర్భపాతము శాస్త్ర నిషిద్ధము! అది బ్రహ్మ హత్యతో సమానము! దానికి ప్రాయశ్చిత్తము ఏదీలేదు. కాబట్టి ...ఆ విధానము నిషేధింపతగినది. కాగా....ఋతుధర్మమును పొందిన మొదటిరోజు- స్త్రీని చండాలినిగ, రెండవరోజు- బ్రహ్మఘాతినిగ, మూడవనాడు- చాకితగ, నాలుగవరోజున శుద్ధురాలుగ చెబుతారు. నాలుగవనాటినుండి స్నానానంతరము ఇంటిపనులు నిర్వర్తించుటకు యోగ్యురాలు! రజస్సు ఆగిన తరువాతే దేవతా సంబంధపు పనులు, పితృకార్యాలు నిర్వర్తించుటకు అర్హురాలు!

ఏదేని శారీరక వ్యాధి పీడితురాలై రజస్సు కనిపించునెడల- ఆ స్త్రీ అపవిత్రురాలుగాదు. ఆ కాలాన్ని "వైకాలికమ"ంటారు. రజస్సు స్రవించు నెడల- ఆ స్త్రీ భర్త సంగమానికి అయోగ్యురాలు!

ఇక.... ప్రమత్తుడై ఋతుకాలమందు భార్యతో సంగమించినవాడు- ప్రజ్ఞ, తేజము, బలము, కనులు, ఆయువును కోల్పోవలసివచ్చును. కనీసము ఆమెతో శయ్యపై కూడ పరుండరాదు.

భార్యతో కలసి భోజనము చేయరాదు. తాను భుజిస్తూ.... భార్య ముఖము చూడరాదు.సంగమకాలాన భార్య ముఖము తప్పక చూడవలెను. ఆ సమయాన చూపులను పోనీయరాదు. తుమ్ము, ఆవిలింత వచ్చిన-భార్యను చూడరాదు. స్వేచ్ఛగా కూర్చున్న భార్యను చూడరాదు. అంతే కాదు....ఇంకా కాటుక పెట్టుకొనే సమయాన, దిగంబరిగా నున్నప్పుడు, అభ్యంగన స్నానము చేసేటపుడు, ప్రసవించు సమయాన- భార్యను చూడ రాదు. కారణము ఆ సమయములో చూడటమువలన- అసహ్యభావము కలిగి, ప్రేమానురాగాలు తగ్గును గనుక!

ఇక సంతానము- "ఔరసుడు, క్షేత్రజుడు, దత్తుడు, కృత్రిముడు" అని నాలుగు రకములుగ చెప్పబడినది.

1] అగ్నిసాక్షిగ వివాహమాడిన భార్యయందు పుట్టినవాడు- ఔరసుడు.

2] భర్త అనుమతిని దీసికొని,దేవరాది న్యాయముతో కన్న సంతానాన్ని- "క్షేత్రజుడ"ంటారు.

3] సంతానము లేనివారికి తల్లిదండ్రులే తమబిడ్డ నిచ్చిన- "దత్తుడ"ంటారు.

4] సకల సద్గుణ సంపన్నుని కుమారునిగ దరిజేర్చుటను-"కృత్రిముడ"ంటారు.

ఎక్కడినుండో వచ్చిపడిన విత్తనము- వృక్షమై, ఫలాలనివ్వగా.... ఆ ఫలాలను రైతు ఎలా సొంతము చేసుకుంటాడో.... అలానే "పరస్త్రీయందు జనించిన సంతతియు క్షేత్రస్వామి సంతతే"నంటుంది- శాస్త్రము! అట్టివారిని "కుండుడు, గోళకుడ"నే పేర్లతో లోకము వ్యవహరిస్తుంది.

1] భర్త ఉన్నపుడు జారునివలన జనించినవాడు- కుండుడు.

2] భర్త మరణానంతరము జారునివలన పుట్టినవాడు- గోళకుడు.

ఇక.... పెద్దవాడు- కుబ్జుడు, పొట్టివాడు, నపుంసకుడు, నత్తివాడు,కుంటుడు,బధిరుడు, జాత్యంధుడు మూగవాడైనపుడు....చిన్నవాడు- ఆ అన్న భార్యను వివాహమాడుట దోషము కానే కాదు.

ఐతే....విచిత్రముగా కనిపించే ఒక విషయాన్ని పరాశరుడు తన పరాశర స్మృతిలో ఇలా చెప్పాడు.

నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతే।
పంచస్వాపత్సు నారణాం పతిరన్యో విధేయతే॥

అంటే....భర్త ఏమైనది తెలియకపోయినా, చనిపోయినా, సన్యసించినా, నపుంసకుడైనా, పతితుడైనా.... మరో భర్తను పొందుట తప్పుకాదు.

కన్యాశుల్కమును గొనుట క్షమించరాని నేరముగా మహర్షులు భావించారు. సంతానాన్ని అమ్ముకొనుటగా దీనిని భావించారు. స్త్రీ ధనముతో జీవించుట జీవన్మృతుడు చేసే పని. అట్టివాడు పై లోకాలకు చేరక....అధోగతి పొందుతాడు. స్త్రీని గౌరవించుట సదాచారము, ధర్మము అంటూ మనువు ఇలా చెప్పాడు.

యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః।
యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రా ఫలాః క్రియాః॥

ఎచ్చోట స్త్రీలకు గౌరవము ఉండునో....అతావున సమస్తదేవతలు నివసిస్తారు. ఎచ్చోట స్త్రీలు గౌరవింపబడరో....అచ్చోట చేసిన పూజలన్నీ నిష్ఫలాతే! స్త్రీలను బాధించువాని కులము నశిస్తుందంటే తప్పుకాదు. వారిని ఆనందపఱచే కులము కులోన్నతి నందుతుంది. వంశాభివృద్ధి యౌతుంది. ఐశ్వర్య కాముడు తప్పక తన స్త్రీల నందఱిని గౌరవించాలి.

యథా నదీనదాః సర్వే సాగరేయాంతి సంస్థితిం।
తథైవా శ్రమణః సర్వే గృహస్థేయాంతి సంస్థితిః॥

బ్రహ్మచారి, గృహస్థుడు, సన్యాసి, వానప్రస్థుడు మొదలగు నాలుగు ఆశ్రమస్థులలో- గృహస్థుడే గొప్పవాడు. నదులు, నదములు అన్నీ చివఱకు తమ పతీ, గతీ అయిన సాగరునిలో లీనమైనట్లు.... గేస్తుపై ఆధారపడే- స్త్రీలు, బాలురు, పెద్దలు, మునులు, పితరులు, దేవతలు మొదలగు వారంతా బ్రతుకుతున్నారు. పంచయజ్ఞములు

గృహస్థుడు ఆచరించాలి. "పంచయజ్ఞముల"నగా.... బ్రహ్మ, పితృ, దైవ, భూత, మనుష్య యజ్ఞాలు! అంటే....అధ్యాపనము, బ్రహ్మయజ్ఞము, తర్పణాలు వదలుటే మో- పితృయజ్ఞము! హోమాదుల నొనరించుట- దైవ యజ్ఞము, బలిదాన మొనరించుట- భూతయజ్ఞము, అతిథి సపర్యల నాచరించుట-మనుష్య యజ్ఞముగా మనువు చెప్తాడు. ఈ ఐదింటిని తప్పక ఆచరించవలెను. హోమము చేస్తే....అగ్నిదేవుని ద్వారా ఆ ఆహుతులు సూర్యునకు అందుతాయి. సూర్యుని వలన- వర్షము, వర్షము వలన- అన్నము, అన్నము వలన- ప్రజలు!

మరి "ప్రజలు" అంటే....గృహస్థులు! శ్వానాలకు, పతితులకు, పాపులకు, రోగులకు వాయసాలకు- పవిత్రమైన ఆహారాన్ని ఈ నేలపైన అందించిన వాడు- పరమపద సోపానము నందగలడు.

అతిథి సపర్యలు చేయువాడు "ఆనందో బ్రహ్మ" యన్నటుల బ్రహ్మానందానుభూతిని పొందగలడు. ఎవని ఇంట అతిథి సంతసించి వెనుదిరుగునో....ఆ ఇంట సిరి కళకళలాడును. ఒక రేయి మాత్రమే ఇంటనుండువాడు, తిథి అంతా ఉండనివాడు కావుననే...."అతిథి" అని చెప్పబడినాడు. అతిథి కిడిన ఆహారము- ఆయువును పెంచుతుంది. కీర్తిని కలిగిస్తుంది. అంతేగానీ... అతిథికి పెట్టక తాను తింటే.... అది కుక్కమాంసమును తినినట్లు. ఐతే-అతిథికన్న ముందు ఆహారమీయ తగినవాడు- నవవధువు, బాలిక, రోగిణి, గర్భిణీస్త్రీలు! అందఱూ భుజించిన తరువాతనే యజమాని తినవలెను.

గృహస్థు- "ధృతి, క్షమ, మనోనిగ్రహము, తస్కరించుకుండుట, పరిశుద్ధాత్మ, అక్రోధము, ఇంద్రియనిగ్రహము, శాస్త్రజ్ఞానము, ఆత్మజ్ఞానము, సత్యసంధత"అనే ధార్మికమైన పదిలక్షణాలు కలిగియుండుటను అలవఱచుకోవాలి.

అన్ని పనులు సాఫీగా సాగాలంటే 'ధనమే' మూలము!"ధనమూలమిదం జగత్" అనిగదా ఆర్యోక్తి! ఆ ధన సంపాదనకు ధార్మిక పద్ధతులు పదిరకాలు చెప్పారు. విద్య, శిల్పము, భృతి, సేవ, గోరక్షణ, వ్యాపారము, వ్యవసాయము, ధృతి, భిక్షాటనము, వడ్డీవ్యాపారము

వడ్డీవ్యాపారి అత్యవసర సమయములో అతి తక్కువ వడ్డీకి- ధర్మాన్ని దృష్టిలో ఉంచుకొని ధనము ఇవ్వాలి. ఇతరులు బాధపడని విధముగా సంపాదించాలి. జలగలా పీడించి సంపాదించరాదు. నీతికోవిదులు ఆ సంపాదనను మెచ్చరు. తామరాకున నీటిబొట్టు నిలవని రీతిగా ధర్మవర్త నుడు- విషయలోలుడుకాక....స్వార్థమును వీడి, కులవృత్తుల నాచరించ వచ్చును.

ఇంకా....నిత్యము ఆచరించవలసిన మానవధర్మాలు ఈ విధముగా వివరింపబడినవి.

ఉదయించేవేళ, అస్తమించేవేళ సూర్యుని చూడరాదు. గగన మధ్యాన్ని చేరినపుడును చూడరాదు. గ్రహణ సూర్యుని చూడతగదు. వర్షములో తడుస్తూ పర్వెత్తరాదు. తన ప్రతిబింబాన్ని నీటిలో చూచుట తగనిపని! పయనించువేళ- ఆవును, దేవతా విగ్రహాన్ని, బ్రాహ్మణుని, మహావృక్షమును, చతుష్పథమును- ప్రదక్షిణము చేయక వెళ్ళరాదని శాస్త్రము!

దిగంబరుడై స్నానము చేయరాదు. నలుగురు నడిచేదారిలో, బూడిదలో, ఆలమందలో, పంటపొలాలలో, నీటిలో, శిథిలమైన దేవాల యాన, పుట్టలో, గోతులలో, నదీతీరాన, నిలబడి, నడుచుచూ- మూత్ర విసర్జన చేయుట ఎన్నడూ తగదు.

నోటితో అగ్ని నార్పరాదు. అగ్నిలో వేయరాని పదార్థములను వేయరాదు. కాళ్ళను నిప్పుతో కాచుకోరాదు. సంధ్యాసమయములో- అన్నము తినుట, పయనించుట, నిద్రించుట శాస్త్ర నిషిద్ధము! నేలను కాలితో గీరరాదు. మల-మూత్రాలను, ఉమ్మిని నీటిలో వేయరాదు. శూన్య గృహములో ఒంటరిగా నిదురించరాదు. రజస్వలతో మాట్లాడరాదు. మేసే ఆవును తోలరాదు. ఇంద్రధనుస్సును చూచినా ఎవ్వరికీ చెప్పరాదు. దోసిలిపట్టి నీరుత్రాగరాదు. తినదగిన పదార్థములను తొడపైన పెట్టుకుని తినరాదు. అనవసరముగా మాట్లాడతగదు. ఊరకే కూర్చొని కాళ్ళు- చేతులు ఊపరాదు.

ఇతరులు ఉపయోగించిన వస్తువులు వాడరాదు. గోళ్ళను నోటితో తీయరాదు. దిగంబరముగా నిద్రించరాదు. కాళ్ళు కడగనిదే ఆహారము తీసికోరాదు. సంధ్యోపాసన- బ్రహ్మవర్చస్సును, ప్రజ్ఞాపాటవాలను కలిగించును.

పెద్దలను సేవించవలెను. చెడును వినరాదు, చూడరాదు. చెప్ప రాదు. ధర్మము- అధర్మము నణగార్చును. సదాచారము, భక్తి-శ్రద్ధలు గలవాడు, అసూయ వీడినవాడు- 'శతంవర్షాణి జీవతి. జీవన్ భద్రాణి పశ్యతి.'

సోమరితనముకన్నా పాపము మరొకటి లేదు. పరదార పొందు ఆయుక్షీణము, మహాపాపము. "సర్వం పరవశం దుఃఖం, సర్వం ఆత్మ వశం సుఖం" సుఖమంటే తనవశమైనది. దుఃఖము పరవశమైనది. తల్లి దండ్రులు, చదువు చెప్పినవారు, సాధువులు నొచ్చుకొను విధముగా ప్రవ ర్తించరాదు. మాంసాహారము పనికిరాదు. దిగంబరిని చూడరాదు. మాన వుని మనుగడకు ధర్మమే మూలము! కాన.... ధర్మాన్ని వీడరాదు. ఎవరి తోనూ విరోధము పనికిరాదు. క్రోధము పాప కారణము!

మనిషిని నాశనము చేసేవి ముఖ్యముగా నాలుగు కనిపిస్తున్నాయి. వాటికి బహుదూరముగా ఉండాలి. 1] దాసస్త్రీలతో పొందు- మర్యాదను పోగొడుతుంది. 2] వేశ్యాసంపర్కము- శరీరాన్ని రోగాలవైపుకు త్రిప్పు తుంది.అంతేకాదు ధనక్షయముకూడా! 3] విధవాస్త్రీ పొందు- ఆయుష్షను హరించేస్తుంది. 4] పరస్త్రీ పొత్తువలన-సర్వసంపదలు నశిస్తాయి.

ఓర్పుచే- పండితులు పరిశుద్ధులు కాగా....చేయరాని పని చేసినవారు- దానముతో; ప్రచ్ఛన్నముగా పాపము చేసినవారు- జపముతో పవిత్రు లౌతారు. కాగా.... వేదవేత్తలు తపస్సుతో శుద్ధు లౌతున్నారు.

ఆలోచించగా.... విగుణమైనా- స్వధర్మమే శ్రేయస్కరము! అచ ంపతగినదైనా- పరధర్మము భయావహము! పరభోగ్యోపజీవి పతితుడే! ానునకు- చదువు చెప్పరాదు. అయోగ్యునకు- దానము ఈయరాదు. అపాత్రదానము చేయరాదు.

నీటితో శరీరాన్ని పరిశుభ్రముగా ఉంచవచ్చు. సత్యభాషణముతో మనస్సు పవిత్రమౌతుంది. విద్యా-తపస్సులతో శరీరము, ఆత్మ పరమ పవిత్రా లౌతాయి. విజ్ఞానముతోబుద్ధి శుద్ధమౌతుంది. నాభికి పై గల అవయవాలు పవిత్రాలు కాగా....నాభి క్రిందివి అపవిత్రాలు! అందుండి అపవిత్రమైన దేహమలాలు వెలువడుతాయి గనుక!

తపః పరం కృతయుగే త్రేతాయాం జ్ఞాన ముచ్యతే।
ద్వాపరే యజ్ఞమిత్యాహుః దానమేవ కలౌయుగే॥

కృతయుగాన తపస్సుతో, త్రేతాయుగాన విజ్ఞానముతో, ద్వాపరయుగాన యజ్ఞయాగాదులతో, కలియుగాన దానముతో- మానవుడు ఇహాన సుఖించి, పరాన మోక్షపథాన్ని పొందుతాడు. కాన....తనకున్నంతలో దానము చేయాలి. దానహీనుని చూచి ధనము నవ్వుతుందట. "భూమికి బరువు ఎవరయ్యా" అంటే "మానిత యాచమాన జనమానస వృత్త్యభిపూర్తి బుద్ధి యెవ్వానికి లే దొకింతయును, వా డొకరుండు భరంబు ధాత్రికిన్, కానలు కావు, శైలములు కావు, పయోధులు కావు భారముల్" అంటాడు శ్రీనాథుడు.

ధరణికి బరువు కొండలు, కోనలు, సముద్రాలు కావట. దానము చేయనివాడేనట!

దానాలలో అన్నదానము గొప్పది. ఆకలిగొని అన్నమడిగిన వానికి అన్నము పెట్టగా, తిని సంతృప్తుడై "అన్నదాతా సుఖీభవ!" అని చల్లని కడుపుతో అంటే....ఆ అన్నదాతకది బ్యాంక్‌లో దాచిన ధనము వంటి పరలోకాన సుఖాలకు సైదోడు అవుతుంది.

ధర్మ సంపాదననే దానము చేయాలి. అది శ్రద్ధతో కూ ఉండాలి. నిరంతరము దానము చేసేవాడు, తన్ను తరింప చేసి కాక.... తనవారి నందఱిని తరింపజేయును. మనసులో ఏ దానముచేస్తాడో....అతడు భావాన్ని పొందుతాడనుటలో సందేహానికి తావులేదు. పూజించి దానము చేసేవాడు, పూజిం

పొందేవాడు- ఇరువురు గౌరవమునుండి తప్పించబడి, స్వర్గాన్నే చేరుతారు. దానములో అలసత్వము పనికిరాదు.

ఆలోచించి చూడగా.... దానము పొందటము ఎంతటి ప్రజ్ఞావంతునికైనా తగినదికాదు. అది అతని అంతఃశక్తిని హరిస్తుంది. ఎంత బాధలో ఉన్నా ....దానము పట్టడము విధి నిషేధము. కాగా ....ఆయువును తగ్గిస్తుంది. తేజస్సును హరిస్తుంది. సంతాన నాశనము కలుగుతుంది.

గృహస్థు స్నాతకులను తప్పక గౌరవించవలెను. యథాశక్తి వారికి సాయమందించిన మానిసి- ఇహ-పర సుఖాల నందగలడు. స్నాతకులు తొమ్మిదిమంది. 1] సంతానార్థము పెళ్ళిచేసికొనదలచి, అందుకై ధనాన్ని యాచించువాడు. 2] తనకున్నదంతా యజ్ఞమునందు బ్రాహ్మణుల కిచ్చుట వలన దరిద్రుడై, ధనాన్ని కోరువాడు. 3] యజ్ఞార్థము ధనాన్ని కోరే వాడు. 4] గురుదక్షిణార్థము ధనాన్ని కోరేవాడు. 5, 6] మాతాపితల సంరక్షణార్థము అర్థాన్ని అపేక్షించేవాడు. 7] బాటసారి. 8] వ్యాధిపీడితుడు. 9] వేదపఠన సౌకర్యార్థము అర్థాన్ని అపేక్షించువాడు. వీరిలో ఎవరు వచ్చి యాచించినా.... కాదనరాదని మనమహర్షులు బోధించారు.

గృహస్థునకు సంఘములో మంచి, చెడు సంపాదించి పెట్టేది- స్త్రీ మాత్రమే! కుటుంబములో పురుషుడు పెద్దగా ఉన్నా....అన్ని కార్యాలను స్వయముగా చక్కదిద్ది; అతనిని ఆర్థిక, రాజకీయ, సాంఘిక, జనజీవన స్రవంతిలో వెలుగొంద చేయునది స్త్రీ మూర్తియే! కాన.... స్త్రీ-పురుషుల ప్రవర్తనా సరళిని గూర్చి మన వారసత్వ సంపదను, భారతీయ సంస్కృతిని పుణికి పుచ్చుకొని; ఆ మహనీయసంపదను తరతరాలుగా తమ వారసుల కందించి; నిస్వార్థపరులై, కౌపీనధారులై విరాజిల్లిన పరమర్షులు ఏమని వివరించి చెప్పారో వినండి-

బాల్యాన స్త్రీని తండ్రి కాపాడాలి. యౌవనములో భర్త, ముదుసలితనాన తనయుడు కాపాడాలి. పిల్లని పెంచి, పెద్దచేసి, యుక్తవయసున పరిణయము చేయని తండ్రి నిజముగా నిందింపదగినవాడు యౌవనవతిని

అనుకూలవతిగా చేసికొని, ఆమెను ఆనందపఱుచలేని భర్త- ఆ స్థానానికే అనర్హుడు! వార్ధక్యభారముతో దిగాలుగానున్న తల్లిని పోషించలేని తనయుడు తనయుడుకాడు. "పుట్టలోన చెదలు పుట్టవా గిట్టవా?"అని అట్టి కుమార్షుని చెదతో పోల్చాడు మన వేమన్న.

సంఘ జీవనములో పురుషుని కన్న స్త్రీకున్న ప్రత్యేకత చూడండి. తనయగా, తన్విగా, తల్లిగా- శారీరక,మానసిక వికాసాలతో కుటుంబాన్ని పెంచే బాధ్యతాయుతముగా ఉంటుంది స్త్రీ. "సర్వకాల సర్వావస్థలలో కంటికి ఱెప్పలా స్త్రీని కాపాడితే- తల్లి వంశము, తండ్రి వంశము సంతోషాన్ని పొందుతాయి. లేనిచో 'దుఃఖ భాగులౌతారు" అంటాడు మనువు. భర్త దుర్బలుడైనా భార్యను రక్షించుట తప్పని సరి.

అంటే.... భార్యకు సరియగు రక్షణ కల్పించిననాడు తన సంతానాన్ని, తన చరిత్రను, తన కులాన్ని, తన్ను, తన ధర్మాన్ని రక్షించుకున్న వా డౌతాడు. అంతేకాక.... తాను భార్యయందు ప్రవేశించి, తిరిగి కుమారునిగ జన్మించుచున్నాడు. మనము భార్యను "జాయ" అంటాము. "జాయ" అంటే అర్థము ఇదే.

తాను సంపాదించి తెచ్చి భార్య కిచ్చుటతోనే పురుషుని పని పూర్తి ఔతుంది. మరి ఆమె ఆ ధనాన్ని భద్రముగా కాపాడుతుంది. ధనాన్ని వ్యయము చేయటము, ధర్మాన్ని పరిరక్షించటము, శాకపాకాలను తగిన విధముగా తయారు చేయటము ఇత్యాది కుటుంబ అవసరాలలో ఆమె తగిన విధముగా ప్రవర్తిస్తుంది. ఇట్టి అవకాశము ఆమెకు కల్పించనినాడు ఆమె మనసు- పరిణతి చెందుటకు మారుగా వికలమై, దుర్జన సాంగత్యానికి; భర్తను దూరము చేసికోవటానికి, ఇతరుల ఇండ్లలో కాలము గడటానికి పురికొల్పుతుంది.

ఇక భార్యాభర్తల బంధములో ప్రధాన భాగము శారీరక బంధవ కాబట్టి....స్త్రీని"క్షేత్రమ"ని, పురుషుని "బీజమ"ని అంటారు.ఇందు క్షే బీజాలు రెండూ సమర్థవంతాలుగా ఉండాలి. మనోవికాసము, ఆ

నందము ఇందు ముఖ్యాలు. రతి బంధాలతో జీవితము ఆనందముగా సాగాలి. ఆ ఆనంద సమయాన జనించిన సంతానము ధైర్యవంతము, వీర్యవంతము, తేజోవంతము, బలవంత మౌతుంది. కనుక ....ఆయుష్మంతుడు పరస్త్రీతో సంగమింపడు.

కాబట్టి.... కామ సంబంధ విషయాలను గమనించి,భార్యతో సంగమించి, ఆమెను ఆనందపఱచాలి. అట్లు చేయనివాడు" భర్త" అనిపించుకోడు? ధర్మార్థ కామ మోక్షాలనే నాలుగు పురుషార్థాలు సాధించాలంటే.... ముందు కామాన్ని పొందాలి. "కామిగాక మోక్షగామికాడు". "రసో వైసః" అంటే.... ఇదే! ఏదో చేయరాని తప్పు చేస్తున్నట్లు భావించటము పెద్ద తప్పు. స్వేచ్ఛగా దీపాన్నుంచుకొని ప్రశాంతముగా జీవన మాధురియైన శృంగారాన్ని సాగించటము గృహస్థునకు శాస్త్ర నిబద్ధము. అందుకే ఏర్పడినవి- రతి బంధాలు వగైరా.

ఉత్తానకరణబంధము : భార్య వెలికిలాపరుండగా పైకొని సంగమించుట. తిర్యక్కరణ బంధము: భార్య ప్రక్కగా పరుండి అభిముఖమై సంగమించుట. స్థిరకరణ బంధము : భార్యాభర్తలు కూర్చుండి సంగమించుట. ఉత్థితకరణబంధము : గోడ మొదలగు వానిని ఆధారముగా చేసికొని నిలబడి సంగమించుట. వ్యాకరణ బంధము : తిర్యక్, జంతువుల వలె సంగమించుట!

ఇక.... దాన-విక్రయాలతో భార్యను వదలి పెట్టరాదు. అన్న భార్య- తమ్మునికి గురుపత్ని! తమ్ముని భార్య-అన్నకు కోడలు వంటిది. ఏ కారణము చేతనైనా భర్త దూరముగా వెళ్ళవలసి వస్తే- భార్యకు తప్పకుండ జీవనాధారము కల్పించాలి.

ఇక- ద్రవ్యాలు అపవిత్రమైతే.... ఎలా పవిత్రా లౌతాయో పరాశరస్మృతి చెబుతున్నది.

దారుమయ పాత్రలు అపవిత్రాలైతే.... కొద్దిపాటిగా వానిని చెక్కితే పవిత్ర మౌతాయి. కాంస్య పాత్రలు- భస్మముతో, తామ్రపాత్రలు- చింత పండుతో తోమిన పరిశుద్ధము కాగలవు. జాతిపాత్రను- మరొక జాత్యా

రాపిడి కలిగిస్తే-శుద్ధమౌతుంది.మృణ్మయ పాత్రను-కాల్చాలి.ధాన్యాలపైన జలము చల్లాలి. వెదురు చాపలు, నార చీరలు, తెల్లని పట్టుబట్టలు, దూది బట్టలు, కంబళ్ళు, భుజపత్ర నిర్మిత వస్త్రాలు-జలప్రోక్షణచే శుద్ధిఔతాయి.

మౌంజీ, చేట, జనుపనార గోతాలు, కృష్ణాజినము, ఫలము, తృణకాష్ఠము, త్రాళ్ళు- ఇవి కూడ నీరు చల్లుటచే పవిత్రమగును. ఇక దూది పఱపులు, దిళ్ళు, రంగువేసిన వస్త్రాలు మొదలైన వానిని-ఎండలో ఆరవేస్తే ... పరిశుద్ధము లౌతాయి.

పిల్లులు, ఈగలు, పురుగులు, కప్పలు-ఇవి అపవిత్ర పదార్థాలపైన ప్రాలి; మరల పవిత్ర పదార్థాల మీద ప్రాలినా- దోషము కొద్దిగా నైనా.... ఉండదు. అది ఉచ్ఛిష్టము కాదంటాడు మనువు.

"పాద ప్రక్షాళన సమయాన క్రింద పడిన నీటి బిందువులు పైన బడినా, మాట్లాడేటప్పుడు- నోటి తుంపరలు పైన బడినా; అన్నము తిన్న తరువాత చేయికడుగుకొనగా చేతికి నూనె, నెయ్యి మొదలగునవి అంటి ఉన్నా ఆది ఎంగిలి అనిపించుకోదు" అని కూడా మనువు చెబుతాడు.

తాంబూలము, చెఱుకు, పండ్లు,వివాహాలలో ఇచ్చే-మధుపర్కము, యజ్ఞములో- సోమపానము వీనికి ఎంగిలి లేదు.

వీథిలోని బురదనీరు; ఓడ, దారి, గడ్డి, అరుగులు అపవిత్రాలైనా- గాలి, సూర్యరశ్మిచే పరిశుద్ధా లౌతాయి.

గాలికి రేగిన- దుమ్ము; స్త్రీ, బాల, వృద్ధులు ఒకప్పుడు కూడ అపరిశుద్ధులు కారు. అంటే.... ఎప్పుడూ పవిత్రముగా ఉండేవారే!

కాంస్య పాత్రలో-పుక్కిలించి ఉమ్మివేసినా, కాళ్ళు కడుగుకొన్నా- ఆరుమాసాలు భూమిలో పాతిపెట్టాలి. లేనిచో దోషము. ఇనుపపాత్రలను- ఇనుపవాటితో రాపిడి పెట్టిన చాలు. సీసాన్ని- అగ్నిలో ఉంచితే దోషము తొలగుతుంది.

దంతాలు, ఎముకలు, కొమ్ములు, వెండి, బంగారము, రత్నాభరణాలు వీనితో తయారైన వస్తువులను నీటితో కడిగిన పవిత్రాలు.

నదులలో మురికినీరు వచ్చి చేరినా ప్రవాహము ఉన్న కారణముగా అపవిత్రము కాదు. వాపికూప తటాకాలలో కారణాంతరాలవలన కలుషితము కలిగితే... నూరు కడవల నీరు తోడి పారబోస్తే దోషము పోతుంది.

ఇవన్నీ కాలానుగుణ్యముగా ఆచరించదగిన ద్రవ్య శుద్ధిని తెలుపు విధానాలు.

ఈ విధముగా మహనీయులచే చెప్పబడిన ధర్మవిధానాలకు తోడుగా తన జీవితానుభవాన్ని జోడించి, దేశకాల పాత్రానుగుణముగా- పితృ, దేవ, ఋషి ఋణాలను దీర్చుటతో- యౌవన, కౌమారాలను పూర్తి చేసిన ఉత్తమ గృహస్థుడుగ రాణించవలెను.

కాగా.... ఇక మిగిలినది వార్ధక్యము! వెంట్రుకలు తెల్లబడతాయి. శరీరము ముడుతలు పడుతుంది, కనులలో, చెవులలో, ముఖాన కాంతి తరుగుతుంది. తలచుకుంటేనే... ఆ యాకృతి భయంకరముగా కనిపిస్తుంది. [illegible] వార్ధక్య దశకొనికి అడుగిడిన వెంటనే ... గృహస్థ భారాన్ని [illegible] అప్పగించి, ముముక్షువై- నిర్జన వనాని కేగి, ఒక ఆశ్రమాన్ని ఏర్పరచుకొని; మౌనిలా దైవాన్ని ధ్యానించాలి.

ఐతే.... అలా వెళ్ళునపుడు తనతో తన అర్ధాంగిని తీసికొని వెళ్ళుట ఉత్తమము. కుమారుల కప్పగించి వెళ్ళుట మధ్యమము. సంయమనము పాటించాలి. యోగిలా మెలగాలి. కాబట్టి.... నిత్యాగ్ని హోత్రము ఉండాలి. అందుకై సుక్ స్రువాది పరికరాలను మాత్రమే తీసుకువెళ్ళాలి గాని....ధనాన్ని, గోవులను, ధాన్యాన్ని ఇంకా సంపదలను వెంటగొని పోరాదు. శీతవాత ఆతపాలకు తట్టుకోవాలి. జితేంద్రియుడై, సర్వభూత దయాపరుడై. సమతా భావముతో మెలగాలి. ఆయా ఋతువు లలో అనుసరించదగిన కర్మక్రియా కలాపాలనుగమనించుచూ ...ప్రవర్తించిన వాడు- భయశోకాలను వీడి, బ్రహ్మపదమును చేరుననుట సత్యము!

వార్ధక్యము-వానప్రస్థము : వానప్రస్థుడై, సర్వసంగ పరిత్యాగిగా అంటే....బాల్యములో బ్రహ్మచర్యము; యౌవన, కౌమారాలలో-గృహస్థా

శ్రమము; వార్థక్యములో వానప్రస్థుడై సన్యాసిలా జీవనము సాగించి, యోగిలా తనువును చాలించాలి. మేడనెక్కువాడు- ఒక్కొక్క మెట్టు నెక్కి, పై భాగాన్ని చేరే విధముగా.... మానవుడు ఒక్కొక్క జీవన మార్గ్మును అంచెలంచెలుగా సాగించి, చివరకు యోగముతో ఎప్పుడూ వీడని ఆనందధామమైన సత్యలోకాన్ని చేరాలి. అందుకు ఉపయోగ పడేవే ఈ మానవ ధర్మాలు! ఆచరించినవాడు పరమాత్మని చేరును. ఆచరించనివాడు కాలుని వాతపడును. ఇదే తేడా!

ఇక.... సన్యాస జీవన సరళిని చూడండి. ఇతర ఆశ్రమాలతో ఈ జగానికి తాను వచ్చిన పనిపూర్తైనది. ఇక.... మిగిలున్నది పరలోకాన దేవుని సన్నిధానము చేరటము. ఎందుకంటే.... సంతానము కన్నవానికి, వేదము చదివిన వానికి, యాగము చేసిన వానికి మాత్రమే మోక్షాన్ని గురించి ఆలోచన చేసే అర్హత ఉంటుంది.

"సర్వసంగపరిత్యాగి" అంటే.... నిరీహుడు. కోరికలు లేనివాడు. అన్ని విషయాలలో అనాసక్తుడు. లౌకిక విషయాలు పట్టనివాడు. అందరిలో ఉన్నా "తానెవరికీ ఏమీకారాదు. తన కెవరూ ఏమీకారు" అనే భావనతో ఉండాలి. గడ్డములు, మీసములు పెంచరాదు. ఆడంబ రాల జోలికి పోరాదు. సర్వము తెలిసినా ఏమి తెలియని బాలుని వలే ఉండాలి. అడగనిదే.... ఎవరికీ ఏ ఉపదేశాలు, బోధనలు వినిపించరాదు. మరణము కావాలని కోరరాదు. మరణ కాలానికై నిరీక్షించాలే తప్ప ఇతరాలోచనలు పెట్టుకోరాదు. దూషణ-భూషణలను సమ దృష్టితో చూడాలి.

కాషాయాంబరధారియై, సదా దైవధ్యానముతో- మనసును ఏకాగ్ర ముగా నిలిపి.... ఏకాంతాన్నే కోరుకోవాలి. సత్కార, ఛీత్కారాలను దగ్గరకు రానీయరాదు. "అన్నగతాః ప్రాణాః" ప్రాణము నిలుపు కొనుటకై ఆ పూటకు తగినంతగా భిక్షావృత్తితో సంపాదించాలి. దాచరాదు. దానికై ప్రాకులాడరాదు. నిరాహారిగా ఉన్నా.... విందార గించినట్లు తృప్తిగా ఉండాలి. మనసును పదిల పరచుకోవాలి.

అందఱిలోని ఆత్మ ఒకటే. ఒకరిని ద్వేషిస్తే తనను తాను ద్వేషించుకున్నట్లే. అందఱిలో నున్నది తానే. తనలోనివే అన్ని ప్రాణులున్నూ! మిన్ను విఱిగి మీదపడినా.... అనృతము పలుకరాదు.

ఇంద్రియ నిరోధము, రాగద్వేషాలను వీడటము; అహింసా పద్ధతి నవలంబించడము- దైవ సన్నిధికి దగ్గఱ దారులు. "పునరపి జననమ్ పునరపి మరణమ్" అనే జనన మరణాల చక్రనేమి క్రమాన్ని గూర్చి చింతించిన సన్యాసికి సర్వాంతర్యామియైన పరమాత్మ రూపాలుగా అవి భాసించుటను గుర్తించవచ్చు. ఏ ప్రాయములోనైనా- ఆ వయో ధర్మాల నాచరించి, సన్యసించినవాడు ముక్తుడగును. "నాత్ర సందేహః" అందులో సందేహము లేదు.

ఈ భువి కేతెంచిన ప్రతివాడు- తను తన ప్రాణములను కాపాడుకొనుచు, పెద్దలు చూపించిన బాటలో ధర్మప్రబోధానువర్తిగా జీవితాన్ని మలచుకొని, సఫల మనోరథుడై, పరిపూర్ణ ఆయుష్కాముడైన "శత మానమ్ భవతి శతాయుః పురుషస్యాతేంద్రియ ఆయుష్యేవేంద్రియ ప్రతితిష్ఠతి!"

అతని జన్మ ధన్యము! అతనిని కన్న తల్లిదండ్రులు ధన్యులు. భరతమాత అట్టి వానిని కన్నందుకు మురిసిపోతుంది.

పశ్యేమ శరదశ్శతమ్
జీవేమ శరదశ్శతమ్
నందామ శరదశ్శతమ్
మోదామ శరదశ్శతమ్
భవామ శరదశ్శతగ్‌మ్
శృణువామ శరదశ్శతమ్
ప్రబ్రవామ శరదశ్శతమ్
అజీతాఃస్యామ శరదశ్శతమ్,

# ఉపాఖ్యానాలతో ధర్మబోధన

## శ రీ ర ము

శరీరమాద్యమ్ ఖలు ధర్మసాధనమ్
దేహే సరోగేతు నచార్థసిద్ధిః ।
ఆరోగ్యం దార్ఢ్యమపీహ లబ్ధమ్
సదౌషధం కాయపటుత్వ సాధకమ్॥.

"కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యాల"నే అంతశ్శత్రువులను జయించాలంటే.... దేహము ఆరోగ్యముగా ఉండాలి.మానవుడు సాధించ వలసిన ధర్మార్థ కామ మోక్షాలను (చతుర్విధ పురుషార్థాలు) సాధించి, జన్మను సాఫల్యము చేసికోవాలంటే శరీరము రోగాల పాలుకాకుండా ఉండాలి. "ఆరోగ్యమే మహాభాగ్యమ"ని కదా.... పెద్దలమాట.

ఆహార విహారాలలో నియమపాలనము అవసరము. శరీరాన్ని పోషించి, రక్షించే ఆహారాన్నే తీసికోవాలి. యోగాభ్యాసము చేస్తూ; ఆయువును పెంచే వనమూలికలను, దివ్యరసాయనాలను అనుభవజ్ఞుల నుండి స్వీకరించవలెను. వ్యాసంగము సరియైనదిగా ఉండాలని పతంజలి మహర్షి చెప్పినాడు! ధర్మ సాధనాలకు శరీరము మూలము కదా!

## ఏకాగ్రత, మనోనిశ్చలత

మానవునికి మనస్సు ప్రధానమైనది. దానికి "అంతరంగము" అని మరో పేరు. మనస్సును నిగ్రహించుట అవసరము. మన పెద్దలు- మనసును కోతితో పోల్చారు. అది ఇష్టము వచ్చినట్లు గంతులువేసే కోతిలా ఉంటుంది. దాని ఆధీనములోనికి మనిషి పోరాదు. దానిని తన అధీనములోనికి తెచ్చుకోవాలి. "మౌనముగా ఉండుట" అంటే.... మూగగా మాట్లాడకుండా ఉండడము కాదు. మనసు లోనికి ఇతర ఆలోచనలను రానీయక ఒకే విషయముపైన నిలబెట్టుట. ఇది కష్టమైన పని ఐనా.... అసాధ్యము మాత్రము కాదు. ఒక పద్ధతి ప్రకారము నిదాన

ముగ శ్వాసక్రియను జరిపినచో.... మనస్సు నిశ్చలమగును. అదే ఏకాగ్రత అంటే.

ఉదాహరణకు.... నదులను చూడండి. ఆ నదులు పుట్టేచోట చిన్నవై, కాలువల వలె ప్రవహించి; క్రమక్రమముగా పెరిగి; పెద్దవై, వాగులువంకలు తిరిగి, వాటిని గురించి ఎవరేమనుకున్నా సరే! ఆ మాటలను లెక్క చేయక తమ పతీ, తమ గతీ ఐన సాగరునిలో లీన మయేటందుకు ఎలా ఉరుకులు, పరుగులు పెడతాయో! అలాగే తనను గురించి ఎవరేమనుకున్నా పట్టించుకోక....మానవుడు ఏకాగ్రతనుసాధించి ముందుకు సాగిననాడు గమ్యము చేరి,"కార్యసాధకుడ"నిపించుకొనును.

స్మృతి ర్వ్యతీత విషయా మతి రాగామి గోచరా।
బుద్ధి స్తాత్కాలికీజ్ఞేయా ప్రజ్ఞా త్రైకాల్యగోచరా॥

జరిగిన కాలమును గుర్తించుట స్మృతి. రాబోవు దానిని తెలిసికొన గలది మతి. కేవలము వర్తమానాన్ని ఆలోచించేది బుద్ధి! భూత, భవిష్యత్, వర్తమానాలను గమనించగలది ప్రజ్ఞ! కాన.... తన మనసును ప్రజ్ఞావంతము చేసికోవాలంటే.... మనోనిశ్చలత, ఏకాగ్రత అవసరము.

## ఇంద్రియ నిగ్రహము

ఇంద్రియాలు పరుగెత్తే గుఱ్ఱాలు. వాటితో పరుగెత్తితే.... ఇక మనిషి గతి అధోగతే. దాంతులైనా, వేదాంతులైనా ముందు ఇంద్రియాలను నిగ్రహించ గలగాలి. కాంతా కనకాలు- మనిషికి బహిరంగ శత్రువులైతే; ఈ ఇంద్రియాలు తనలోనే ఉండి- ముప్పుతిప్పలు పెట్టి, మూడు చెఱువుల నీరు త్రాగించే అంతశ్శత్రువులు! వానికి పగ్గము పట్టి వెనుకకు లాగి, నిలువరించిన వాడే మనిషి అంటే....! ఇంద్రియ నిగ్రహము అభ్యాసముతో గాని అలవడదు. వాటి శక్తిని తెలియచేసే ఒక సంఘటన మన పురాణ పురుషులలో కనిపిస్తుంది చూడండి!

వ్యాసమహర్షి ఒకనాడు తన శిష్యులలో గొప్పవాడైన జైమినిని పిలచి "నాయనా జైమినీ! ఒక శ్లోకము చెబుతాను. వ్రాయి" అంటూ "బలవాన్ ఇంద్రియగ్రామో విద్వాంస మపికరతి" అని చెబుతాడు. దాని భావము "బలవత్తరమైన ఇంద్రియ సమూహము విద్వాంసు నైనా పెడదారి పట్టిస్తుంది" అని.

ఆ శ్లోక పాదము వినగానే ...జైమినిలోని అహంభావము పెల్లుబుకి, బుసలు కొట్టినది. "మహానుభావా! సామాన్య మానవుని ఇంద్రియాలు ఏడిపిస్తాయేమోకాని ... విద్వాంసుని సమీపించగలవా" అంటూ....గురువు గారు చెప్పిన విధముగా వ్రాయక- దానిని మార్చి "బలవాన్ ఇంద్రియ గ్రామో విద్వాంసం నాపకర్షతి" "ఇంద్రియాల సముదాయము బలవత్తర మైనా విద్వాంసుని ఏమీ చేయలేవు" అని వ్రాసాడు. దీనిని గమనించిన వ్యాసులవారు- జై మినికి కనువిప్పు కలిగించాలనుకుంటారు.

ఒకరోజున శిష్యుల నందఱినీ ఏదో పనిచెప్పి, దూరముగా పంపారు. ఆశ్రమాన తాను, జైమిని మాత్రమే ఉన్నారు. అంత..... జైమినిని సమిధలకై అడవిలోని కంపారు. జైమిని గురువాజ్ఞాబద్ధుడై సమిథలకై వెళ్ళాడు. జైమిని అరణ్యమధ్యము చేరగనే....వాతావరణము మారినది. క్షణాలమీద ఆకాశము కారు మేఘాలతో నిండిపోయినది. జడివాన, హోరునగాలి, ఉఱుములు, మెఱుపులు.

తలదాచుకొనే చోటుకై వణకుతూ చుట్టూ కలయచూచాడు. కొద్ది దూరములో ఓ కుటీరము మినుకు మినుకుమనే దీపపు వెలుగులో కని పించినది. పరుగు పరుగున ఆ ప్రదేశము చేరుకుంటాడు. తీరా చూస్తే.... ఎవరూలేరు. ఎచట వెళ్ళారో ఏమో అనుకుంటూ....కట్టెలతో నిప్పునుచేసి, చలికాచుకుంటూ ఉంటాడు.

ఇంతలో ఒక జవ్వని ఒయ్యారము ఒలకబోస్తూ చలికి వణకిపోతూ లోనికి ప్రవేశిస్తుంది. "కాసింత చోటిమ్మ"ని కోరుతుంది. జైమిని "సరే" నంటాడు. ఒయ్యారముగా నడయాడుతూ వచ్చి, చలి కాచుకొనుటకు కూర్చుంటుంది. ఆమె ఒంపు-సొంపులకు జైమిని మనోవికారమును పొందు

తాడు. ఒకసారి బిగియార కౌగిలించుకో నిమ్మంటాడు. అందుల కా జవ్వని "మునివరా! మీకిది తగునా?" అంటుంది. ఆమె మాటలు వినేస్థితి ఎప్పుడో దాటిపోయాడు. "నీకీ బంధనవేళ వస్త్రమూల్య పరీక్షలేల?" అంటాడు. బలాత్కారము చేయబోగా....

ఆమె "తమరు కనులు మూసికొనినచో.... మీ కోర్కె తీర్చెద" నన్నది. ఇంద్రియలోలుడై అంగీకరించి, కనులు మూసికొని, ఆమెను కౌగిలించుకుంటాడు. ఆ కౌగిలిలో నిదానముగా "జైమినీ!" అనే పలకరింపు. కనులు తెఱచాడు. జైమిని కౌగిలిలోనున్నది జవ్వనికాదు. సాక్షాత్తు తన గురుదేవుడు వ్యాసమహర్షి.

కనుల నీరు నిండగా....జైమిని గురుని పాదాల మ్రోల వ్రాలి, క్షమించకోరతాడు. నవ్వుతూ వ్యాసుడు "ఇంద్రియాలు పండితుని ఏమీ చేయలేవా?" అంటాడు. అది తనకు కనువిప్పు కలిగించడానికి మహర్షి పన్నిన పథకమని భావించి, తన తప్పును ఒప్పుకొని, శ్లోకాన్ని గురువుగారు చెప్పినట్లే మార్చి వ్రాస్తాడు. కాన.... చదువరులారా! ఇంద్రియ సమూహములో చిక్కుకొని, వ్యామోహాల మోహములోపడి చెడిపోకండి. పట్టుదలతో ఇంద్రియాలను నిగ్రహించండి! నర జన్మను సార్థకము చేసికోండి!!

## శీలము

"సకలం శీలే న కుర్యాద్యశమ్" మానవుడు శీలవంతుడు కావాలి. శీలము లేక సుగుణాలెన్ని ఉన్నను.... అవి శవాలంకారములే. శీలములేని మనిషి- పశువుగా మారుతాడు. శీలము గుఱించిన ఒక కథ.

ప్రహ్లాదుడు తానొనర్చిన పుణ్యకర్మల వలన ఇంద్రుని వెడలగొట్టి; స్వర్గమునకు రాజైనాడు. ఇది ఇంద్రునికి భరింపరాని అవమానము ఐనది. తమ కులగురువైన బృహస్పతిని సమీపించి "గురువరా! నాదీనావస్థ చెప్పుకొనసిగ్గగుచున్నది. మీకు తెలియని విషయము లుండునా? నా సింహాసనము ప్రహ్లాదుని నుండి తిరిగివచ్చే మార్గము సెలవిండు" అని దీనవదనుడై ప్రార్థించినాడు. ఆలోచించిన దేవ గురువు "ఇంద్రా నీ సింహాసనము

తిరిగి నీవు పొందాలంటే....భిక్షుక వేషధారివై, ప్రహ్లాదుని కొలువు చేరు. ఇచ్ఛాదాన సమయములో నీవు ప్రహ్లాదుని శీలముకోరు. అది మినహా మరో దారి లేదు" అన్న బృహస్పతి మాటలు వీనులవిందు కాగా.... ఇంద్రుడు మరుక్షణము బిచ్చగాని వేషముతో ప్రహ్లాదుని సభకు వచ్చినాడు.

అప్పుడు ప్రహ్లాదుడు ఇచ్ఛాదానము చేస్తున్నాడు. తగిన అదనులో వెళ్ళిన శచీపతి చేయిచాపి "శీలదానము చేయమ"న్నాడు. ఆశ్చర్యముగా ప్రహ్లాదుడు బిచ్చగానివంక తేఱిపాఱ జూచి.... "నా శీలముతో నీకెలా తృప్తి కలుగుతుంది? ఏమిటి యీ వింత కోరిక??" అన్నాడు.

"అయ్యా! నాకది చాలు? కాదనరు గదా" అంటాడు బిచ్చగాడు. ఆడిన మాటను తప్పని ప్రహ్లాదుడు "సరే తీసికో" అని భగవదర్పణ ముగా శీలాన్ని యాచకునకిస్తాడు. అంతే.... వెనువెంటనే ఒక దివ్య సుందర తేజోవతి ప్రహ్లాదుని దేహము నుండి బయటకొచ్చినది. "నీ వెవరవు? నా నుండి ఎందుకు బయల్పడినావు?" అన్నాడు ప్రహ్లాదుడు. అపుడా తేజోరమ "నేను నీ శీలాన్ని! దానము చేసినావు. కాన.... నిను వీడి, పోతున్నాను" అంటూ బిచ్చగాని శరీరములో చేరినది.

అంతలోనే మరో అద్భుత తేజస్సంపద బయల్పడినది. మరల ప్రహ్లాదుడు "నీ వెవరివో? ఎందుకిలా నానుండి వెలుయ్యావో?? తెలిసికో గోరుతున్నా"నన్నాడు. అపుడా కాంతిపుంజము "నేను నీ శౌర్యాన్ని. నీ శీలమునకు సేవకుడను. శీలముతోపాటు నేనూ నిన్ను సేవించాను. నీ నుండి శీలము వెళ్ళినది. కాన....నేనూ వెళుతున్నాను. శీలములేని నీలో ఇమడలేను" అంటూనే భిక్షకునిలో చేరినది.

వెనువెంటనే మరో అందాల గారాలబాల జిగేల్ మంటూ తనను వీడి రాగా....ప్రహ్లాదుడు వెలవెలబోతూ, తడబడే మాటలతో- "నీ వెవ తివి? నను వీడిపో గారణమేమొ" చెప్పమన్నాడు. "నేను నీ రాజ్య రమను! శీలానికి నేనూ దాసురాలినే! శీలమున్న చోటే నా నిలయము!

అందుకే శీలము లేన్ని నిను వీడినాను." అంటూ బిచ్చగాని ధరించిన ఇంద్రుదృష్టిలో లీనమైనది.

ఫలితముగా పదవీభ్రష్టుడయాడు ప్రహ్లాదుడు. ఇంద్ర సింహాసనము నధిష్ఠించాడు.

కాన.... మిత్రులారా! శీలము అంత ముఖ్యము!! వా డెంతటి వాడైనా సర్వస్వాన్ని కోల్పోతాడే తప్ప....తన ప్ర నిలుపుకోలేడని యీ కథ మనకు చెబుతుంది. అందుకే.... శీలవంతులు కావాలి!

## స్నేహము

యత్ర మిత్రత్వ మిచ్ఛంతి తత్ర త్రీణి నకారయేత్।

వాగ్వాద మర్థసంబంధం పరోక్షే దారభాషణమ్॥

స్నేహము మానవ జీవితములో ప్రధానమైనది. ఈ ఇద్దటినే దురదృష్టవంతులుగా చెపుతారు. ఒకరు- తల్లిపాలు త్రా వారు. రెండు-జీవితములో మంచిమిత్రులను సంపాదించుకో నేర స్నేహమును , లుపుకోవాలంటే.... మూడు విషయాలలో వహించాలట! ఒకటి స్నేహితులతో వాదులాడరాదు. రెండు ధ దపు లావాదేవీలు పనికిరావు. మూడు స్నేహితుడు లేప ఆతని భార్యతో మాట్లాడరాదు.

ఇందులో.... కొందఱు పండితులు కొద్దిపాటి స్నేహము చే స్నేహితుడుగ, బహుకాలము స్నేహము చేసేవానిని- మిత్రుడుగ లోని మాటను విప్పి చెప్పుకొనేవానిని- సుహృత్తుగా వివరించారు

ఐతే....ఏడడుగులు కలసి నడిస్తే చాలు.... అదే స్నేహము "సఖ్యం సాప్తపదీన ముచ్యతే" "నేస్తము" అంటే చెడిపోన్నిది. క లలో- తోడు-నీడగా ఉండేది ్నేహము! ఈ జగతిలో ఎంతో చేసిన వారికిగాని.... అంతటి మంచి స్నేహము దొరకదంటాడ సుభాషితకవి.

మొత్తముమీద స్నేహము ఎంతో విలువైనది. సంఘజీవిగ మా వుడు మసలుకోవాలంటే....ఇది ఎంతో అవసరము. మరి అట్టి స్నేహితు మోసగించరాదు. ఆ మోసము పంచమహాపాతకాలను మించినదేవె మరి! మిత్రద్రోహాన్ని వివరించే ఒక చక్కని కథను- జక్కన త 'విక్రమార్క చరిత్ర' లో చెపుతాడు.

అది విశాలనగరము. రాజు నందుడు. ప్రజలను- కన్నబిడ్డలవ పరిపాలించేవాడు. నందుని మంత్రి బహుశ్రుతుడు. గురువు- శారదా త యుడు. విజయపాలుడు నందుని కొడుకు తండ్రి ఎంత సన్మార్గుడో త యుడంత దుర్మార్గుడు.

ఒకసారి విజయపాలుడు క్రూరమృగాలను వేటాడుటకై అడవి వెళ్ళాడు. వేటాడ నేర్వని ఈతనిని పులిచూచి ముందుకు దూకినది. ఈ హఠాత్సంఘటనకు అదరి, చెట్టెక్కి, చిటారుకొమ్మకై ప్రాకినాడు. కానీ... అచట ఒక ఎలుగుబంటి కూర్చుని ఉన్నది. దానిని చూడగనే... తనకి మరణము తప్పదనుకున్నాడు. వేడి నిట్టూర్పులతో, బిత్తర చూపులతో "ముందునుయ్యి, వెనుకగొయ్యిగా నున్న"దనుకొని అటు-నిటు చూచినాడు

విజయపాలుని పరిస్థితి గమనించిన ఎలుగుబంటి- సాదరముగా దగ్గఱకు పిలిచినది. "మిత్రమా! భయపడకు! రా! నీవు నాకు స్నేహితుడ వయ్యావు." అని ధైర్యము చెప్పి, దగ్గఱకు తీసుకున్నది. ప్రొద్దుపోగా.... రాజకుమారుని- తన తొడపైన నిద్రబుచ్చినది. అక్కడే ఉన్న పులి- ఎలుగుబంటితో ఇట్లన్నది....

"ఓసి తెలివితక్కువదానా! నమ్మతగునా? మన ప్రాణాలు తీయవచ్చిన రక్కసి ఈ మానవుడు. నన్నుచూచి అటులున్నాడుగానీ....లేకున్ననిన్ను చంపక వదలునా? కాన .... క్రిందకు నెట్టుము. ఆరగించి వెళతాను" అన్నది. మిత్రద్రోహమునకు ఎలుగుబంటి మనసొప్పలేదు. పులి తన మొదటి ప్రయత్నము వ్యర్థము కాగా... నిరాశ చెందినది. అర్ధరాత్రి దాటినది. రాజకుమారునకు మెలకువ వచ్చినది. అపుడు ఎలుగుబంటి-

విజయపాలుని తొడపైన నిదురించినది. పులి మరల భేదోపాయమును ఉపయోగించినది.

"ఓయి తెలివితక్కువ మానవుడా! క్రూరమృగాలను నమ్మే నీ వంటి మనిషి మరొక రుండునా? నేనావలి కేగగనే....ఎలుగు నిన్ను విడుచునా? దానిని క్రిందపడద్రోసితివేని దాని మాంసమును తిని వెళ్ళెదను. సూర్యోదయము కాగానే ...నీవు నీ దారిన వెళ్ళవచ్చు."

పులి మాటలు విని, కృతఘ్నుడై, శివమెత్తిన వానివోలె- ఎలుగు బంటిని ఒక్క త్రోపు త్రోసినాడు. కాని.... ఎలుగుబంటులకు ఒక కన్ను తోనే నిదురించుట దేవు డొసగిన వరము. అవి మరొకంటితో పరిసరాలను గమనిస్తాయి. ఆ కారణముగా రాజకుమారుడు త్రోసినా....ఎలుగు క్రింద పడకుండా; కొమ్మను పట్టుకొని, పైకి వచ్చినది. ఇపుడు నిజముగా విజయపాలునకు పంచప్రాణములు పైకెగసి నట్లైనది. కానీ.... ఎలుగు రాజకుమారునికి రక్షణ నిచ్చినది. ఈ రూపముగా కూడా పులి భేదోపాయము పాఱలేదు.

కృతఘ్నత కారణముగా- గతాన్ని మఱచి, పిచ్చివానిలా మరునాటి నుండి "ససేమిరా" అంటూ అఱుస్తూ తిరుగుతున్నాడు రాజకుమారుడు.

ఇక ఇచట రాజకుమారుడు కానరానందున.... రాజు తన కుమారుని వెదుక భటులను నేల నాలుగు చెఱగులకు పంపుతాడు. వారు కారడవిలో కాకిలా "ససేమిరా" అని అఱుస్తూ తిరుగుతున్న విజయపాలుడిని తండ్రి దగ్గఱకు చేరుస్తారు. రాజు కోర్కె మేరకు- విజయపాలుని మరల మనిషిగా చేయుటకు వైద్య విజ్ఞానవేత్త లెందఱో పరిశీలించి, తమ అశక్తతను వెళ్ళబఱచి వెళ్ళారు.

ఒక ప్రజ్ఞానంతుడు వచ్చి, విజయపాలుని చూచి "రాజా దేవ సభను ఏర్పాటు చేయండి. మీ కుమారుని బాగు చేస్తాను" అంటాడు. మరునాటి నిండు కొలువులో- ఆ ప్రజ్ఞానిధి విజయపాలుని"రాజకుమారా!" అని పిలుస్తాడు "ససేమిరా" అని అంటాడు రాజకుమారుడు. మరి

అతను ఆనాటి నుండి "ససేమిరా" అను మాట తప్ప ఇంకోమాట అనలే దాయె. అప్పు డా ప్రజ్ఞాశాలి- సభలోని వారిని చూస్తూ....రాకుమారునితో-

"సజ్జనభావము గల్గు సు
హృజ్జనులను మోసపుచ్చు టది నేరుపె; నీ
పజ్జం దొడపై గూర్చిన
యజ్జంతువు జంపజూచు టది పౌరుషమే?"

అనగానే.... ససేమిరాలో 'స' మాని "సేమిరా" అంటాడు విజయ పాలుడు. అపుడు ఆ పండితుడు రాజపుత్రు నుద్దేశించి-

"సేతువు దర్శింప మహా
పాతకములు బాసిపోవు; ప్రాణసఖునకున్।
ఘాతుక మతి నొనరించిన
పాతక మేతీర్థసేవ బాయునె నరునిన్?"

అంటాడు. "సేమిరా"లోని "సే" అక్షరము అనక.... "మిరా" "మిరా" అంటాడు రాజకుమారుడు. తిరిగి ఆ నయశాలి-

"మిత్రద్రోహి, కృతఘ్నుడు
ధాత్రీసురహంత, హేమతస్కరుడు, సురా
పాత్రీభూతుడు, నిందా
పాత్రులు, వీరెల్ల నరక భవనా వాసుల్".

అనగానే...."మిరా"లో "మి" వదలి "రా", "రా" అంటాడు. అప్పు డా ప్రజ్ఞానిధి రాజువైపు తిరిగి-

"రాజేంద్ర! విజయపాలుని
రాజిత శుభమూర్తి చేయ రతి గలదేనిన్:
పూజార్హుల వీ రెల్లర
బూజింపు మనూన దాన భోజన విధులన్"

అని చదివిన వెంటనే....విజయపాలుని మతిభ్రమణము తొలగి పోతుంది. జరిగినదంతా ఒక్కసారి మదిలో మెదలుతుంది. ఇల్లువీడి

వెళ్ళినది మొదలు అడవిలో జరిగిన సంఘటన వఱకు వివరముగా సభా సదులకు చెబుతాడు. మిత్ర ద్రోహ కారణముగా విజయపాలు డెట్టి విపత్తు పాలైనది తలచుకుంటూ.... మహాపాపాలలో దీని శక్తి ఎట్టిదో గమనిస్తారు సభలోని వారు.

కాన.... ఓ చదువరీ! చేసినమేలు మఱువరాదు. కృతఘ్నుని శవాన్ని కుక్కలు కూడ ముట్టవు. మిత్రద్రోహము చేయరాదు. ఆ పాపము నుండి బయట పడుట కష్టము!

## మనస్సు

"మనోహి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చా శుద్ధ మేవ చ।
అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామ వివర్జితమ్॥
మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః।
బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయగ్ం స్మృతమ్"

అని ఉపనిషత్ అంటున్నది. అంటే....మానవుని నడిపించేది మనస్సే మరి! ఆ మనసు శుద్ధమని, అశుద్ధమని రెండు రకాలు! కామముతోకూడిన మనస్సు అశుద్ధము; కామవాసనలు లేనిది శుద్ధము. అంతేకాక.... విషయ బంధాల సాలెగూటిలో చిక్కుకోవాలన్నా, మోక్షాన్ని పొందటానికైనా మనస్సే ప్రధానము. ఇందుకు ఒక చక్కని కథ ఇతిహాసాలలో ఉన్నది.

దేవదాసు, వేశ్యాదాసు ఇరువురూ బాల్య స్నేహితులు. పెరిగి, పెద్దవారయ్యే కొలదీ.... పేరుకు తగినట్లుగా జీవితాలలో నిలచారు. అంటే ....దేవదాసు- దేవుని గుడిలో పూజారికాగా, వేశ్యాదాసు- వేశ్యాలోలు డయ్యాడు. దేవదాసు పూజా కార్యక్రమాలు నిర్వహిస్తున్నా అతని మనస్సు మాత్రముదేవునిపైన నిలచేది కాదు. "ఆహా! నిజముగా నిదృష్టమంటే.... వేశ్యాదాసుదే! ఈ జగములో పొందవలసిన కామసుఖాలను వేశ్యలదగ్గఱ పొందుతున్నాడు. మరి నేనో....ఎంతో దురదృష్టవంతుడను! ఊహ తెలి సినది మొదలు- ఈ రాళ్ళు-ఱప్పలను కడగటము, పూజించటముతప్ప...

నా జీవితములో చెప్పుకోవలసినది ఇంకేమున్నది? ఏ సుఖము ఎట్లా ఉంటుందో తెలియని బండబాయి నైతినిగదా!" అనుకుంటుండేవాడు.

ఇక ఇచట వేశ్యాదాసు "అయ్యో! నా జీవితము వ్యర్థమైనది గదా! నేనెంత దురదృష్టవంతుడను? వేశ్యాలోలుడనై, ఆమెకోసము పాటు పడటము తప్ప మనసారా ఒక్కసారైనా ఆ దైవాన్ని స్మరించలేక పోతు న్నానే!" అని విలపించేవాడు.

కొంతకాలానికి ఇద్దరూ మరణించారు. దేవదాసు నరకము చేరాడు. వేశ్యాదాసు వైకుంఠానికి వచ్చాడు. ఈ దృశ్యము నారదుని కంటబడినది. "ఇదేమి న్యాయము? ఇదేమి ధర్మము?? దైవ సన్నిధాని దేవదాసునకు నరకమా? వేశ్యాలోలుడైనందుకా స్వర్గలోక సుఖాలు? బ్రహ్మకు ముసలితనాన బుద్ధి పెడదారి పట్టినదేమో! తెలుసుకుంటాను." అంటూ బ్రహ్మనుచేరి "నాన్నా! ఏమిటి నీసృష్టి? చాల గమ్మత్తుగా ఉన్నది. ఈ తారుమారేమిటి? చూడు- ఏమి చేసావో?" అంటూ తాను గమనించిన దంతా నాన్నగారిముందు పెట్టాడు.

అంత విధాత "నారదా! శరీరాలు కాదిచట ప్రధానము- మనస్సు సుమా! దైవ సన్నిధానములో ఉన్న దేవదాసునకు వేశ్యాస్మరణ. వే దగ్గర ఉన్న వేశ్యాదాసునకు- దైవ స్మరణ. అతని మనసుని శ్రీహరి నామస్మరణ అందువలన- ఈ మార్పు జరిగినది. బాహ్యాడం రాలు కాదు ప్రధానము. అంతఃకరణము! అది పవిత్రముగా ఉండాలి- అంతే....! నీవనుకొన్నట్లు ఏ పొరపాటు జరుగలేదు." అంటూ ఇలా అంటాడు-

న కాష్ఠే విద్యతే దేవః న పాషాణే న మృణ యే।
భావేషు విద్యతే దేవః తస్మాత్ భావోహి కారణమ్॥

భగవంతుడు రాళ్ళల్లో, అప్పల్లో, కవులలో లేడు! మనసులోనే ఉన్నాడు. అన్నిటికీ మనసే కారణము.

# ధర్మము - ధర్మానుసరణ

మానవుడు సాధించవలసిన చతుర్విధ పురుషార్థాలలో మొదటిది ధర్మము, మిగిలిన మూడు పురుషార్థాలు దీనితోనే ముడిపెట్టబడి ఉన్నాయి.

సత్యం దమ స్తపశ్శౌచం సంతోషో హ్రీ క్షమార్జవం
జ్ఞానం శమోదయా ధ్యానమేష ధర్మస్సనాతనః॥
ధర్మం శనైస్సంచితయా ద్వల్మీక మివవర్తికా
పరలోక సహాయార్థం సర్వభూతాన్య పీడయన్॥
నాముత్రహి సహాయార్థం పితా మాతా నతిష్ఠతః
న పుత్ర దారా న జ్ఞాతిర్ధర్మ తిష్ఠతి కేవలః॥
ఏకః ప్రసూయతే జంతురేక ఏవ ప్రమీయతే
ఏకో న భుంక్తే సహృదం ఏకఏవ చ దుష్కృతం॥
కృతం శరీర ముత్సృజ్య కాష్ఠలోష్ఠ సమంక్షితే
విముఖా బాంధవాయాంతి ధర్మస్త మనుగచ్ఛతి॥
తస్మాద్ధర్మం సహాయార్థం నిత్యం సంచిమయా చ్ఛనైః
ధర్మేణ హి సహాయేన తమస్తరతి దుష్కృతేమ్॥

"సత్యము, ఇంద్రియ నిగ్రహము, తపము, ఆచారము, సంతోషము, సిగ్గు, ఓర్పు, రుజుత్వము, శిష్టాచారము, జ్ఞానము, శాంతి, దయ, ధ్యానము" అనేవి సనాతన ధర్మాలు! మానవుడు ఏ జీవికీ బాధ కలిగించరాదు. చెదల పుట్టవలె-పరలోకార్థమై ధర్మాన్ని ఆచరించాలి. మాతా పితలు, భార్యా-పిల్లలు మొదలగువారు తనతోరారు. తనతోపాటు వచ్చేది ధర్మమే.

పుట్టినపుడు ఒంటరివాడు. మరలి పోవునాడు మరొకరితో కలిసిపోడు. ఒంటరిగనే మరణిస్తాడు. పుణ్య-పాపాలకు తానే కర్త. శవాన్ని వారి వారి ఆచారాల ననుసరించి ఖననమో, దహనమో చేసి; శ్మశానము నుండి వెనుదిరిగి వస్తారు. పరలోక సుఖాలకై- ఇహలోకాన పాపాలకు దాసుడు కారాదు, పాపవిదూరుడు కావాలి. అపుడే అమరసౌఖ్యము!

అమర సుఖాల అనంతరము మరల మానవజన్మ! ఎందుకంటే.... కర్మ ఫలముతో జన్మించినవాడు సకల సంపదలు కలిగి, ధర్మానుసరణ జరుగును. ఆలోచించి చూడగా.... ఉభయలోకాలలో సుఖమే చక్రము వలే మానవుని అనుసరించుచున్నది. ఇది మన్వాది మహర్షులు చెప్పిన ధర్మానుసరణ.

## అతిథి సత్కారము

గృహస్థుని ఆశ్రయించి ఎందరెందరో ఉంటారు. వారందరిని ఉన్నంతలో సత్కరించాలి గాని, లేదనరాదని శాస్త్రము చెబుతోంది. తిథి, వార నిర్ణయము లేక భోజన సమయానికి రమ్మని పిలువకయే చుట్టములా ఇంటికి వచ్చిన వానిని అతిథి అంటారు. అట్టి అతిథిని త్రికరణ శుద్ధిగా ఆదరించి, ఆనందపటచాలే తప్ప నిరాశతో వెనుదిరిగి పోనీయరాదు. ఇది గృహస్థుని ముఖ్య ధర్మము.

వచ్చినవాని గుణ-గణాలను గాని; పాండిత్య, పామరత్వాలను గాని పరిశీలించ నక్కరలేదు. అతడెవరైనా సరే అతిథి. అతిథి సత్కారమును మించిన సత్కారము లేదు. అందుకే మన పెద్దలు "అతిథి దేవో భవ" అన్నారు! అతిథి- దైవముతో సమానము అని దీని భావము. అంటే.... మన ఇంటికి వచ్చిన అతిథి సంతసించిన సకల దేవతలు సంతృప్తులౌతారన్నమాట. ఇదే విషయాన్ని వాల్మీకి మహర్షి- మైనాకుని ద్వారా మనకిచ్చిన సందేశముగా భావించవచ్చు.

ఆంజనేయుడు సీతాన్వేషణకై సాగరాన్ని లంఘిస్తున్నాడు. అతని గమనము వాయు గమనాన్ని మించినది. చూచాడు సాగరుడు. తనలో ఇమిడి ఉన్న మైనాకుని- "పయనించే పావనికి విశ్రాంతికై లేచి నిలబడ వలసినది"గా చెబుతాడు. లేచి నిలబడిన మైనాకుడు వేగవంతుడైన వాయు సూనునితో ఏమంటున్నాడో చూడండి-

అతిథిః కిలపూజార్హః ప్రాకృతోపి విజానతా।
ధర్మం జిజ్ఞాసమానేన కింపునస్త్వాదృశో మహాన్॥

"ఏమీ తెలియని వాడైనా అతిథి పూజింపదగిన వాడైయుండగా మీ వంటి వారిని గౌరవింపకుండ దగునా?" దీనినిబట్టి అతిథి సత్కారము ఎంత మహత్తరమైనదో గమనించండి.

## తల్లిదండ్రులయందు భక్తి

ఈ జగాన గల జంతు జాలములో మానవజన్మ ఉత్తమము. అది ఎన్నో జన్మల పుణ్యఫలము. ఆ జన్మకు తల్లిదండ్రులు మూలము. జన్మ కారకులైన జననీ జనకులను భక్తితో సేవించడము తన విధిగా భావించాలి. "మాతృదేవోభవ" "పితృదేవోభవ" "ఆచార్య దేవోభవ" అంటూ మొదట తల్లిని, తర్వాత తండ్రిని. ఆ పై గురువును ప్రత్యక్ష దైవా లన్నది ఉపనిషద్వాణి.

నాస్తి మాతృసమం దైవం నాస్తి పితృసమో గురుః
తయోః ప్రత్యుపకారోసి న కథం చ న విద్యతే॥
మాతా పితాచ ప్రీతేస్యాత్ పుత్రగుణైర్యది
సపుత్ర స్సకలం ధర్మం ప్రాప్నుయాత్ తేన కర్మణా॥

అనేమో శాస్త్రము చెబుతోంది

తల్లితో సమానమైన దైవములేదు. తండ్రితో సమానమైన గురువు లేడు. వారి ఋణము ఎంత తీర్చినా తీరేది కాదు. కాన.... కృతజ్ఞులముగా ఉండటమే! మాతాపితల నానందపఱచిన వానిదే సుకృతి అంటారు. అట్టి ప్రత్యక్ష దైవాలను సంతోషపఱచక ఎవరికి ఏమిచ్చినా, ఎంతచేసినా ఫలితము శూన్యము! కాన ... ధర్మవ్యాధ, శ్రవణకుమార చరితముల నాదర్శముగ తీసికొని తల్లిదండ్రులను సేవించినవాడే పుణ్యాత్ముడు. వాడే వంశోద్ధారకుడు.

## పుత్ర స్వరూపము

పున్నామ్నో నరకాద్యస్మా త్పితరం త్రాయతే సుతః
తస్మాత్పుత్ర ఇతి ప్రోక్త స్స్వయమేవ స్వయంభువ॥

"పుం" అను పేరుగల నరకమునుండి రక్షించువాడు పుత్రుడు. "జనకుని పూజలం కడు ప్రసన్నుని చేయునతండు పుత్రుడు" అంటాడు ఒక కవి. అన్ని విధాల త్రికరణశుద్ధిగా తల్లి-దండ్రులను పూజించాలి. తల్లి దండ్రుల మీద దయలేని పుత్రుడు పుట్టినా గిట్టినా ఒకటే నంటాడు-రాజ యోగి వేమన. తండ్రికి పుత్రుడు పుట్టినపుడు ఆనందము కలుగదని, నలుగురిలో మెప్పును పొంది, తండ్రిని మెప్పించిననాడే నిజమైన పుత్రోత్సాహము ఆ తండ్రి పొందుతాడని అంటాడు సుమతీశతక కారుడు. కాన.... సంతానము పెద్దల పెద్దరికాన్ని కాపాడుచూ మెలగాలి.

## త్రికరణములచే చేయరానివి

అభక్షస్య భక్షణం హింసా మిథ్యాకార్య నివేశనం
పరస్వానా ముపాదానం చతుర్థా కర్మకాయకం॥
అవిబద్ధ ప్రలాపత్వం అసత్యంచా ప్రియంచయత్
పరోక్ష తశ్చపైశున్యం చతుర్థా కర్మవాచికం॥
పర స్త్రీ ద్రవ్యసంకల్ప శ్చేతసా నిష్టచింతనం
అకార్యాభినివేశశ్చ చతుర్థా కర్మమానసం॥

మనస్సు, మాట, చేత- ఈ మూడింటిని త్రికరణము అంటారు. మానవుడు ఈ మూడింటిని ఒకే త్రాటిపై నడపాలి. మూడింటిని మూడు దారులలో పోనీయరాదు. తినరాని పదార్థములు తినుట, ఇతరులను హింసించుట, అనవసరపు పనులు చేయుట, పరుల వస్తువులను తీసికొనుట- ఈ నాలుగు శరీరముతో చేసే పాపాలు. అధిక ప్రసంగము, అసత్యభాషణము, అప్రియాలు పలుకుట, పరోక్షములో అపనిందలు వేయుట- ఈ నాలుగు మాటలతో చేసే పాపాలు. పర స్త్రీ వ్యామోహము, పరద్రవ్యాపేక్ష, అకార్యాలలో పట్టుదల వహించడము- ఇవి మనసుతో చేసే పాపాలు. మనిషిగా మారాలంటే పైన చెప్పిన దోషాలను వదలిపెట్టాలి.

## శయన విధి

స్వగృహే ప్రాఙ్ముఖః కుర్యాత్ శ్వసురే దక్షిణాముఖః
ప్రత్యఙ్ముఖః ప్రవాసేచ నకదాచిదు దుఙ్ముఖః
తృణే దేవాలయే దైవ పాషాణే చైవ పల్లవే
అంగణే ద్వారదేశౌతు మధ్యభాగే గృహస్యచ॥

స్వగృహాన తూర్పువైపుగ పరుండాలి. మామగారింటనైతే- దక్షిణాభిముఖము! ఉత్తరాభిముఖుడై ఎప్పుడూ ఎచటా పరుండరాదు. గడ్డి, ఱాయి, చిగురాకులపై శయనించుట తగదు. దేవాలయాన, ద్వారాన, ఇంటి మధ్యన పెద్దల సన్నిధానమున పరుండరాదని శాస్త్రము చెబుతున్నది.

## మౌనము

ప్రభాతే మైథునేచైవ ప్రవాసే దంతధావనే
స్నానే భోజనకాలేచ మౌనం షట్సువిధీయతే.

ప్రాతః కాలాన, మైథున సమయాన, మల, మూత్ర విసర్జన సమయాన, స్నాన సమయాన, దంతధావనవేళ, భోజనవేళ ఎవరితో మాటాడక మౌనముగా ఉండాలంటుంది మన హిందూ ధర్మము.

## ధ్యానము

ధ్యానము చేయునప్పుడు ఏకాంతముగా ఉండాలి. మనోనిశ్చలత ప్రధానము. అందుకై ఒక దేవతా మూర్తిని (ఇష్టమైన) ఎదుట నుంచుకొనవలెను. చూపులు మూర్తిపై నుంచిన మనసు ఆ మూర్తిపైనే లగ్నమగును. క్రమముగా చూపులను, మనసును ఒకేచోటకు తెచ్చి; కనులు మూసికొని, నిస్తరంగ నీరధిలా గంభీరముద్రను దాల్చుట ధ్యానముగా చెప్పారు.

ధ్యాన సమయములో నేలపై కూర్చోరాదు. దర్భాసనము, లేడి చర్మము, పులిచర్మము లేదా నూతన వస్త్రము.... వీనిలో ఏదైనా సరే వేసికోవాలి! ఐతే ఏ ఆసనముపై కూర్చొని చేస్తే- ఏ ఫలము కలుగుతుందో చూడండి.

కౌశేయం కంబళం చైవ అజినం పట్టమేవవా
ధారుజం బలపత్రం చ ఆసనం పరికల్పయేత్॥

కృష్ణాజినే జ్ఞానసిద్ధిః మోక్షశ్రీః వ్యాఘ్రచర్మణి
వశాజినే వ్యాధినాశః సర్వం వైచిత్ర కంబళే.

వెదురు ఆసనమైతే దరిద్రముకాగా, కంబళి దుఃఖవిమోచనము, కుశాననము పుష్టినిస్తే, కొయ్య భాగ్యహీనతకు కారణమౌతుంది కృష్ణాజినము జ్ఞానము కలిగించగా, పులిచర్మము మోక్షదాయిని ఔతుంది. చిత్రాసనము వలన- సకల శుభాలు కలుగుతాయి. స్నానముతో శరీరము శుద్ధియైతే....దైవ స్మరణ మనసును పరిశుద్ధము చేస్తుంది. తాను ఏచోట కూర్చోదలిస్తే- ఆచోటును గోమయముతో అలికి, రకరకాల రంగ వల్లులను తీర్చిదిద్దాలి. మంత్రము బిగ్గరగా అనరాదు. కనీసము పెదవుల నైనా కదల్చరాదు. మనసులోనే అనాలి. అంటే ధ్యానము మౌనముగా సాగాలన్నమాట.

## సాధన

"అభ్యాసము కూసువిద్య" అన్నారు పెద్దలు, అలవాటుచేస్తే.... కానిదిలేదు. "తినగ తినగ వేము తీయన" అంటాడు వేమన! ప్రయత్నము చేస్తే.... సాధించలేనిది లేదు. నోరులేని జంతువులు సైతము అలవాటు చేస్తే- ఎన్నో అద్భుతమైన పనులు చేయటము సర్కస్‌లో మనము చూస్తున్నాము! మరి నోరులేని పశువులే సాధనతో- చేయలేని పనులు చేస్తుంటే.... నోరున్న మనిషి పట్టుదలతో సాధించలేని దేమున్నది. మానవుడు-మాధవుడు; నరుడు నారాయణుడు అగుటకు కావలసిన బాటను మన శాస్త్రాలు చూపుతున్నాయి. అ దారిలో నడచి, సాధనచేసి, మోక్షశ్రీ నందుకోవాలి. అపుడే జన్మసాఫల్యత. సాధన అంటే అలవాటు చేయుట. అభ్యాసము అని "సాధనకు" మరో పేరు.

## అనుకరణ

గతానుగతికో లోకో నలోకో పారమార్థికః
గోదా మహానదీ తీరే నష్టమే తామ్రభాజనం॥

బ్రాహ్మణులకు ప్రతిదినము సూర్యోదయానికి పూర్వము గోదావరినదీ తీరాన సంధ్యవార్చుకొనుట అలవాటు. అందుకు వారు

రేవునకు రాగిచెంబు పట్టుకొని వెళ్ళేవారు. వారిలో ఒక బ్రాహ్మణునికి ప్రతిరోజు తన రాగిచెంబు మాటుటమో, పోవటమో జరిగేది. ఈ బాధ నుండి బయటపడటానికి అతడొక ఉపాయము ఆలోచించాడు. అందరి కంటె ముందువెళ్ళి, ఇసుకతో దిబ్బచేసి; ఆ దిబ్బలో తన రాగి చెంబును కూర్చి, స్నానానికి నదిలో దిగాడు. ఎక్కువసేపు నదీప్రవాహముతో స్నానము చేస్తే ఆరోగ్య భాగ్యము అని శాస్త్రము ఉన్నందున చాలా సేపు నదిలో నున్నాడు.

ఇంతలో వరుసగా వచ్చిన బ్రాహ్మణులు తమకంటె ముందున్న రాగిచెంబు దిబ్బనుచూచి- "ఓహో! ఈరోజు ఇలా చెయ్యాలి కాబోలు" అనుకొని, అందఱూ ఇసుక దిబ్బలో రాగిచెంబులు దూర్చి స్నానానికి వెళ్ళారు. ఈ బ్రాహ్మణుడు ఒడ్డుకు వచ్చి తన చెంబును చూడబోతే అన్నీ ఇసుక దిబ్బలలో కూర్చిన రాగి చెంబులే- వాటిలో తన చెంబేదో పోల్చుకోలేక దిగాలుపడి ఇలా అనుకుంటాడు. "ఒకడు ఒకపనిచేస్తే మఱొకడు అదేపనిచేస్తాడు. అనుకరించటము మంచిదే! కాని.... అనుకరించేముందు వారెందుకు అలా చేయవలసి వచ్చిందో తెలుసుకుంటే ఎంత బాగుండును! ఆ ఆలోచన లేకపోవటము వలననే కదా ఈ గోదావరీ తీరాన నేను రాగిపాత్రను కోల్పోయాను!!" అంటాడు.

మనలో చాలమంది ఒకరి నొకరు అనుకరిస్తారు. కాని.... అనుకరించేముందు విషయజ్ఞానాన్ని గమనించరు. గమనించి చేసిన అనుకరణ సత్ఫలితాన్నిస్తే- గమనించని అనుకరణ నష్టహేతువని తెలిసికోవాలి.

## మ ధు ర భా ష ణ ము

ఉ॥ మాటలచేత దేవతలు మన్ననజేసి వరంబులిచ్చెద
ర్మాటలచేత భూపతులు మన్ననజేసి ధనంబులిచ్చెద
ర్మాటలచేత గాముకులు మన్ననజేసి సుఖంబులిచ్చెద
ర్మాటలు నేరకున్ననవమానము న్యూనము మానభంగమున్॥

అని కవి వాక్కు! మధురముగ మాటాడుట ఒక కళ. మాటాడు విధానము ఎటులుండవలెనో మనకు చెప్పివాడు మారుతాత్మజుడు.

సుగ్రీవుని ఆదేశానుసారము రామ-లక్ష్మణుల వివరాలను తెలిసి కొనుటకై వచ్చిన మారుతి మాటాడిన తీరు- తన్ను ఆనంద పఱచగా.... రాముడు-లక్ష్మణునితో "సోదరా! ఈతని ప్రసంగము ఎంత శాస్త్రీయముగా ఉన్నదో చూచినావా? ఇంత సేపు మాటలాడినా.... ఒక్క అపశబ్దము గాని, అధిక ప్రసంగముగాని కనిపించలేదు. వ్యాకరణ దోషము కాన రాదు సరికదా.... మాటలు దూకుడుగా లేవు. అట్లని... నిదానముగానూ లేవు. చక్కని లయబద్ధమైన మధ్యమ స్వరముతో మాట్లాడినాడు. సకల శాస్త్రాల నెఱిగిన వారు, నవ వ్యాకరణ పండితులైన గాని ....ఇట్టి వాక్చాతురి అలవడదు. ఇట్టి ప్రసంగము మరి వినబోము" అంటాడు. దీనిని బట్టి....భాషాదోషము లేక, భావప్రకటనా దారిద్ర్యము లేక ధార్మిక రీతిలో ప్రసంగము సాగాలని, విన సొంపైన బాణీలతో మాట్లాడ వలెనని తెలియుచున్నది.

మంచి మాటకారి మాటలు- అందఱిని అలరిస్తాయి. అట్టి మాటలు విన్న- దేవతలు వరాలిస్తారు. రాజులు-గౌరవించి, ధనరాశు లిస్తారు. మాటలే కాముకుల కళావిలసితాలు. మరి అట్టి మాటలు నేర్వని వానికి- అవమానము, తక్కువ తనము కలుగుతాయి.

మన వేదాలు "సత్యమ్ బ్రూయాత్ ప్రియమ్ బ్రూయాత్, న బ్రూయాత్ సత్య మప్రియమ్" అంటున్నాయి. అంటే.... నిజము చెప్పాలి. ప్రియమైన మాటలే చెప్పాలి. అప్రియాలు అనరాదు. ఐతే... మాటనేర్పరులు- తమ వచో నైపుణ్యముతో మనసు గాయపడకుండా చెప్ప గలరు. ఎంత కఠోర సత్యాన్నయినా....మనసు నొవ్వకుండా, మధుర భాషణతో పలుకగలరు. మన్ననలంద గలరు.

## పాఠకాధములు వీరే...!

గీత శ్శీఘ్రీ శిరఃకంపీ తథా లిఖిత పాఠకః
అనర్థజ్ఞః అల్పకంఠశ్చ షడేతే పాఠకాధమాః॥

"కూనిరాగాలు తీస్తూ-చదివేవాడూ, తొందరగా-చదివేవాడూ, తల ఆడిస్తూ- చదివేవాడూ, వ్రాయక- చదివేవాడూ, అర్థము తెలియక-చదివే వాడూ, అల్పకంఠుడు- ఈ ఆర్గురూ పాఠకాధముల"ని యాజ్ఞవల్క్య శిక్ష చెబుతున్నది. కాన.... ఈ ఆరు దోషాలు లేకుండగ చదవాలి.

## మూఢుడెవరు?

అశ్రుతశ్చ సమున్నద్ధో దరిద్రశ్చ మహామనాః
అర్థాంశ్చా కర్మణా ప్రేప్సు ర్మూఢ ఇత్యుచ్యతే॥

"శాస్త్రము చదువనివాడు, విననివాడు; తాను దరిద్రుడై ఉండి. గొప్ప కోరికలు కలవాడు; పనిచేయక....తినువాడు మూఢుడ"ని భారత ఉద్యోగ పర్వములో విదురుడు వివరిస్తాడు.

## మానవుని మనుగడకు సాక్షులు వీరే...!

ఆదిత్య చంద్ర అనిలోఽనలశ్చ।
ద్యౌర్భూమి రాపో హృదయం యమశ్చ॥
అహశ్చ రాత్రిశ్చ ఉభే చ సంధ్యా।
ధర్మోపి జానాతి నరస్య వృత్తమ్॥

సూర్యుడు, చంద్రుడు, వాయువు, అగ్ని, ఆకాశము, భూమి, నీరు, మనస్సు, యముడు, పగలు, రేయి, ఉదయము, సాయంత్రము, ధర్మము ఈ పదునాలుగు మంది- నరుని నడవడికను ప్రతిక్షణము గమనించే ప్రత్యక్ష సాక్షులు. అందరూ పాపభీతి గలిగి, మంచి మనస్సుతో ఉండాలి. అందుకే....

"అంతరంగమందు అపరాధములు చేసి
మంచివాని వలెను మనుజుడుండు।
ఇతరు లెఱుగకున్న ఈశ్వరు డెఱుగడా?
విశ్వదాభిరామ వినుర వేమ॥"

అంటాడు- ప్రజాకవి వేమన!

# కష్టములు-భగవంతుని సన్నిధి చేరుటకు దగ్గఱ త్రోవ

మహాభారత యుద్ధము ముగిసినది. పాండవులను- విజయలక్ష్మి వరించినది. ఇక....శ్రీకృష్ణుడు ద్వారకకు ప్రయాణమై, అందఱి దగ్గఱ సెలవు తీసుకొనుచూ....కుంతీదేవి దగ్గఱకు వెళ్ళి"అత్తా! ఇక నాకు సెలవా మరి! "అంటూ...."నీకేమి కావాలో కోరుకో" మన్నాడు. అందు కామె- "కష్టాలు కలకాలము ఉండేటట్టు అనుగ్రహించ"మన్నది.మళ్ళీ ఆమే-తాను పడిన కష్టాలు చాలక.... ఇంకా ఎందుకు ఎక్కువగా కష్టాలను కోరుకుం టున్నదో.... కారణము ఇలా చెప్పినది....

విపదో నైవ విపదః సంపదో నైవ సంపదః ।
ఆప ద్విస్మరణమ్ విష్ణోః సంత్త్స్యైవ సంస్మృతిః॥

మనము దేనిని "ఆపద"అని అనుకుంటున్నామో....అది సంపదకాదు. ఆపద-విష్ణుస్మరణ చేయుటకు అంటే.... భగవానుని మఱువకుండుటకు, ఆ దయామయుని దరిచేరుటకు దగ్గఱదారి! కాగా.... సంపద- ఆ దేవ దేవుని మఱపించి, వానికి దూరము చేస్తుంది. కాన.... సంపదలు నాకు వద్దు! ఆపదలే కావాలంటుంది.

దీనివలన- ఆపదలలో దైవదూషణము పనికిరాదు. త్రికరణ శుద్ధిగా- విష్ణు స్మరణ చేయాలి. ఈ ఆపదలు దైవ సన్నిధానాన్ని చేర్చే రహదారులు! అని తెలియుచున్నది.

# మొదట పురుషకారము... ఆ పైన దైవము

గురు శిష్యులిద్దఱు- తీర్థయాత్రలకై బయలు దేరారు. ఆనాడు ప్రయాణ సాధనాలు గాని, రహదారులు గాని లేవు. దారి గాని, డొంకగాని లేని బాటనే ప్రయాణము సాగేది. మార్గమధ్యములో

ఊరూర ధర్మసత్రాలు ఉండేవి. మరి ఈ గురు శిష్యులు- దారిలో ఒక ఊరిలోని సత్రాన బసచేసారు. తెల్లవారినది! మరల ప్రయాణమై పోబోవగా....ఒక తీతువు పిట్ట అఱుస్తూ... వీరి దారి కడ్డముగా వెళ్ళినది. గురువుగారికి శకున శాస్త్రము తెలుసు. "ఇదేమో తీతువు పక్షి! పైగా అఱుస్తూ....వెళ్ళినది అదెంతో అశుభము. కాబట్టి.....నేటికి ప్రయాణము ఆపి మఱునాడు ఉదయాన బయలుదేరుట మంచిది"అన్నారు-గురువుగారు.

కానీ.... గురువుగారి మాటలే మాత్రము రుచించని శిష్యుడు- "శకున ఫలితము ఎలా ఉన్నా.... ప్రయాణము సాగించుట, కర్తవ్యము"ని తన అభిప్రాయమును విన్నవించుకున్నాడు. గురువుగారు వినలేదు. సమీప పట్టణాన కలిసికోవాలనే ఒడంబడికతో- శిష్యుడు ముందుకు సాగినాడు. గురువుగారు మాత్రము- నాటి రేయి అచటే ఆగారు. ఇక.... శిష్యుడు ఒంటరిగ సమీపపట్టణము చేరేసరికి....దినకరుడు అస్తాద్రికి చేరుకున్నాడు.

ఆ పట్టణములో అతని నెవ్వరూ ఆదరించలేదు. మరుసటి రోజు వఱకు నిరాహారిగనే ఉన్నాడు. మరురేయి ఆకటి బాధ నణచుకోవడానికి ఎలాగో రహస్యముగా అంతఃపురమందలి రాకుమారి శయ్యాగారము చేరుకున్నాడు. ఎవరూ లేనందున అచట నున్న మధుర పదార్థాలను అవురావురుమని తిన సాగాడు. ఆదే సమయములో- రాకుమారి ప్రవేశించి అతనిని రాకుమారుడుగా భ్రమించి, నవ వసంత రాగముతో- వీణియ మీటి, శిష్యుణ్ణి "రా! రమ్మ"ని ఆహ్వానిస్తుంది.

శిష్యుడు-తన పాండిత్యముతో, సరసతతో రాకుమారిని ఆ రేయి మురిపించి, కరగించి, మఱపించి, పరవశింపజేస్తాడు. తెల్లవారితే.... గుట్టు బయట పడుతుందని, వేకువనే- అటనుండి జారుకొని, తన బసకు చేరుతాడు.

తెల్లవారి రాకుమారి ద్వారా విషయము తెలిసికొన్న రాజు ఉగ్రుడై "క్రిందటి రాత్రి నగరము చేరిన క్రొత్తవారిని బంధించి తెమ్మ"ని భటుల్ని పంపిస్తాడు. ఎంచక్కా దొరుకుతాడు శిష్యుడు.

సభలో శిష్యుణ్ణి చూచిన రాకుమారి- పులకించి, తండ్రి చెవిలో గుస గుస లాడుతుంది. రాజు- శిష్యుని తన అల్లునిగా చేసుకుంటాడు

రాజు, అల్లుడు (శిష్యుడు)సింహాసనారూడులై ఉండగా....గురువు- సభకు వచ్చి, తన శిష్యుని జాడ తెలియటము లేదని ఫిర్యాదు చేస్తాడు. వెంటనే శిష్యుడు దిగివచ్చి "నేనే స్వామీ మీ శిష్యుడను. నాపైన శకున ప్రభావము పడలేదు. పురుష ప్రయత్నము ఉంటే.... దైవము తోడవు తాడని నేటి నా ఉనికి తెలుపుతున్నది కదా! శకునము, శకునము అని చేతలుమాని, కలసి వచ్చే భాగ్యాన్ని కాలదన్నుకోవటము పురుషలక్షణము కాదంటున్నాను. మీరే మంటారు గురువరా?!" అన్నాడు శిష్యుడు. తెల్లబోయాడు గురువు. అందుకే "కర్తవ్యము నీవంతు! కాపాడుట నావంతు!!" అన్నాడు కృష్ణపరమాత్మ.

## సోమరి తనము (బద్ధకము) పనికిరాదు

సోమరి తనము- మానవుని బానిసను చేస్తుంది. స్వేచ్ఛావిహంగ ములా విహరించాలంటే....సోమరితనాన్ని పారద్రోలాలి. సతతము వర్తమానమే మానవుని స్వాధీనము. ముందేమి జరుగబోవునో- ఊహించి చెప్పగలవారు లేరు. పైగా.... ఈ శరీరము- నశ్వరము(నశించేది). నీటి బుడగ వంటిదన్నారు వేదాంతులు. తనదైన ఈ క్షణాన్ని- ఎంతో విలువైనదిగా భావించి ,పురుషార్థ సాధకుడై, ముందుకు సాగాలి. కాని నాడు అతనికి పతనము తథ్యమని తెలిపే ఒక శ్లోకము ....మన ఇతిహాసా లలో ఉన్నది.

రాత్రి ర్గమిష్యతి భవిష్యతి సుప్రభాతమ్
భాస్వానుదేష్యతి హసిష్యతి పంకజ శ్రీః
ఇత్థం విచింతయతి కోశగతే ద్విరేఫే
హా హంత హంత నలినీం గజ ఉంజహార॥

సరోవరములో- అందాలు చిందే పంకజాలను చూచినది- ఒక తుమ్మెద! ఆ కలువలలోని మధువును త్రాగుచూ....ఆనందముగా "ఝుమ్" అని నాదాలు చేస్తూ తిరుగుతున్నది. ఒక పద్మములోని మకరంద

రసాస్వాదనకై- అందు ప్రవేశించినది. అంతలో సూర్యాస్తమయము కాగా.... పద్మము ముకుళించు కొన్నది. అందే ఉన్న తుమ్మెద "రేపు ఉదయాన సూర్యుడు ఉదయించగనే ఎగిరిపోవాలి" అనుకున్నది. ఈ లోగా...ఒక మదగజము-స్నానానికై సరోవరములోదిగినది. సరోవరాన్ని- తొండముతో, పాదాలతో- చిందర వందర చేసినది. పంకజాలు నలిగి పోయినై. పద్మములో ఉన్న తుమ్మెద- ఆ తాకిడికి మరణించినది.

ఈ కథ ద్వారా- అలసత్వాన్ని వీడి, లక్ష్యమును చేరండని మానవులకు మన శాస్త్రాలు చెబుతున్నవి. వివేకానందుడును ఇట్టిధర్మాన్ని బోధించే సూక్తిని పదేపదే చెప్పేవాడు....

"ఉత్తిష్ఠత జాగ్రత్త ప్రాప్యవరా న్నిభోదత॥

లెమ్ము! ఆగుము! జాగరూకుడవై గమ్యము చేరువఱకును అలసత్వముతో విశ్రమింపకుము".

సోమరి : "తన్ను తాను బంధించుకొనుటకు- పొడవైన త్రాడు గలవాడు" అని పెద్దలు నిర్వచించిరి.

## ఋణాను బంధము

కనిపించే ఈ ప్రకృతిలో- మానవజన్మ ఎన్నో జన్మల పుణ్య ఫలము! ముక్తిని పొందేటందుకు సోపానము మానవజన్మ. దొరకిన ఈ సదవకాశాన్ని వినియోగించుకో లేనివాడు- రెండు కాళ్ళ పశువు. ఆలోచిస్తే....మానవ జన్మ కత్తి మీదసాము. ఎందుకంటే....ఋణానుబంధ ముగా - జన్మ పరంపర ఏర్పడుతుందని ఆర్యులు చెబుతారు. మరి ఋణాను బంధము నుండి- విముక్తుడు కావాలంటే....అన్ని ఋణాలతోపాటుగా.... ‹ఋణము, ఋషిఋణము, పితృఋణాలను తీర్చుట- తన విద్యుక్త ముగా భావించాలి. "ఋణానుబంధ రూపేణ పశుపత్ని సుతాలయాః" ఒకు ఒక చక్కని ఉదాహరణ....

కాశీనగరాన ఒక బ్రాహ్మణుడు కలడు. అతడు వేద వేదాంగా ను చదువుకున్నవాడు. అతని ఆకారమును చూస్తే.... చదువుల తల్లి

సరస్వతి-ఈ రూపములో భూమికి దిగి వచ్చినదా.... అన్నట్లుండేవాడు! ఆనాడు అందఱికీ ఆదర్శ పురుషుడు. దానము తీసికోడు! ఎవరినీ ఏమీ యాచించడు. తనకున్న దానితో సంతృప్తి పడేవాడు. సుగుణాల ఖని! శాంతమే అతని సంపద.

ఆ కాశీ నగరమందే.... ఒక హరిజను డున్నాడు. వాడా నగరమును కావలి కాచుట దినచర్య. ప్రతి దినము రాత్రివేళ- నాలుగు బజారులు తిరిగి, జాము జామున ప్రజలను మేల్కొలుపుచూ.... దండోరా వేయు వా డన్నమాట. సన్మార్గ గామి. ఐతే ...సంతానహీనుడు. నాటి సంఘాన గల ప్రతివారిని చూచాడు. వారిలో తన కన్నివిధాల ఆదర్శముగా నిలచిన వాడు.... ఆ బ్రాహ్మణుడు మాత్రమే. అట్టి సచ్చరిత్రుని తనయునిగ పొందాలని ఉబలాటము.

"పూజ కొద్దీ-పురుషుడు! దానము కొద్దీ- బిడ్డలు!! కలుగుతార"ని చెప్పగా విన్నాడు. "సద్గుణ మణియైన ఆ బ్రాహ్మణునకు ఏదైనా దానము చేసి, అట్టి వానిని బిడ్డనుగ కనాల"ని కలలు కంటున్నాడు. ఆ బ్రాహ్మణుడు- ఎవరి నుండీ ఏ పదార్థమూ తీసికోడు సరిగదా....కన్నెత్తి కూడా చూడడు! కాగా.... తగిన సంతతికై ఎలాగైనా సరే....బ్రాహ్మణ సేవ చేయాలని కూడ సంకల్పించాడు. అందుకై పొంచి....పొంచి అతని ప్రతి కదలికనూ- గమనిస్తున్నాడు. ఇలా....కొన్ని రోజులు గడచినాయి.

అది మండు వేసవి! ఒకనాటి ఉదయాన పొరుగూరికి బయలు దేరినాడు బ్రాహ్మణుడు. మధ్యాహ్నవేళ- వచ్చినపని పూర్తి కాగా.... ఇంటికి తిరుగు ముఖము పట్టినాడు. సగము దూరము సాగినది పయనము! పైన ఎండ వేడిమికి- నెత్తి మాడుతున్నది. కాళ్ళు నేలకంటుకు పోతున్నాయి. నడక ముందుకు సాగటము లేదు. వేడిగాలులు- శరీరాన్ని తపింప చేస్తున్నాయి. ఏమి చేయాలో.... బ్రాహ్మణునకు పాలు పోవటము లేదు. ఇదంతా చాటుమాటుగా గమనిస్తున్న హరిజనుడు- తన కోర్కె ఫలించాలంటే.... ఇదే సమయమని సంబరపడి; ఆ బ్రాహ్మణుడు-గమనింపని రీతిగా.... ముందుకు సాగి, దారిలో క్రొత్త చెప్పుల

ఇత నుంచి వెళ్ళాడు. ఆ చెప్పులను చూచిన బ్రాహ్మణుడు- ఆనందించి, తప్పని సరిగాన.... వాటిని ధరించి- ఇంటికి వచ్చాడు. మరునాడు -"మార్గ మధ్యములో" తనకు చెప్పులు దొఱికినవి.... ఎవరివైతే వారు వచ్చి తీసుకు వెళ్ళవలసినద"ని దండోరా వేయించాడు. ఎవరూ రాలేదు. "ఈ ఋణమును తీర్చుటకై మరల జన్మనెత్తవలసి వస్తుందేమోన"నే దిగులుతో మరణించాడు.

ఈ బ్రాహ్మణుడు మరణించిన కొలది కాలానికి ఒకనాటి శుభ సమయాన హరిజనుని ఇల్లాలికి అచ్చముగా బ్రాహ్మణుని రూపు రేఖలతో మగ శిశువు జన్మించాడు. పసివానికి "బాపనయ్య" అని నామకరణము చేసారు. బాపనయ్యకు పూర్వజన్మ సంస్కార బలము వలన గతము లీలగా గోచరిస్తున్నది. "బాపనయ్య ఏమిచ్చినా.... చేతితో తీసికోవద్దు. తాకవద్ద"ని భార్యకు చెప్పి, గ్రామాంతరము వెళతాడు హరిజనుడు. ఐతే.... ఆ రాత్రికి తిరిగి రాలేదు. నగరము తిరగటానికి తండ్రికి బదులుగా తప్పెటను చేబూని,దండోరా వేయుటకు బాపనయ్య వెళతాడు.

రాజ ప్రాసాదములో నిదురించే రాజుకు- ఒక కూడలి దగ్గఱ దండోరాతో పాటు ఒక శ్లోకము వినిపిస్తుంది. గవాక్షాన్ని చేరి- ఆశ్చర్యముతో చూస్తూ....ఆశ్లోకమును శ్రద్ధగా వింటాడు రాజు.

"ఆశయా బద్ధతే లోకో కర్మణా బహుచింతయా।
ఆయుక్షీణం న జానాతి తస్మా జ్జాగ్రత జాగ్రత॥

ఓ మహాజనులారా! ఈ లోకమంతా ఆలోచనలతో, ఆశలతో బంధింపడి ఉన్నది. క్షీణించే ఆయువును గుఱించి ఎవరూ పట్టించుకోవటము లేదు.కాన.... జాగ్రత్త వహించండి". అంటూ.... మొదటి కూడలి- దగ్గఱ బోధచేసి, రెండవ కూడలి చేరతాడు. రాజుకూడ తన ప్రాసాదాన రెండవ కూడలి దగ్గఱి గవాక్షాన్ని చేరి, బాపనయ్య మాటలు వింటాడు.

"కామ క్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠంతి తస్కరాః
జ్ఞానరత్నాప హారాయ తస్మా జ్జాగ్రత జాగ్రత॥

"ఓ మానవులారా! మన ఈ దేహములో- కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యములనే ఆఱుగురు దొంగలున్నారు. వారు నీలోని జ్ఞానమనే రత్నాన్ని కాజేయాలని చూస్తున్నారు. కాన ... జ్ఞానము పోగొట్టుకొని, అజ్ఞానివి కావద్దు. జాగ్రత్త సుమా!" అంటూ బాప నయ్య ముందుకు సాగగానే....రాజు మూడవ కూడలి దగ్గఱి గవాక్షము వద్ద నిలబడి దండోరాను ఆలకిస్తాడు.

జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునఃపునః
సంసారసాగరం దుఃఖం తస్మా జ్జాగ్రత జాగ్రత్త॥

"నిదురించు నరులారా! జన్మించుటే దుఃఖ కారణము. అందునా ముసలితనము భయంకర దుఃఖహేతువు. ఇక భార్యా పిల్లలు మీ మీ పత నానికి నాందీ వాచకాలు. సంసారము ఒక సాగరము. ఒకపరి ఇవంతా గమనించి, తగు జాగ్రత్త వహించి, మసలుకోండి".... అంటూ నాలుగో కూడలి చేరగా విచిత్రానుభూతితో రాజు నాలుగో గవాక్షమును సమీపిస్తాడు.

మాతానాస్తి పితానాస్తి నాస్తి బంధు సహోదరాః
అర్థంనాస్తి గృహంనాస్తి తస్మా జ్జాగ్రత జాగ్రత్త॥

"సంసార చక్రపరిభ్రమణములో తిరిగే ఓ మనుజులారా! ఈ తల్లీ, తండ్రీ, భార్యాపిల్లలూ, సహోదరులూ, ఇల్లు, వాకిలీ అంతా మాయ. మాయాజాలములో చిక్కుకుపోకండి. క్షణికమైన ఈ వ్యామోహములో పడి చెడిపోకండి. జ్ఞాననేత్రమును తెఱవండి. జాగరూకత వహించండి మాయాతీతులై మెలగండి"

నగర సంచారము పూర్తికాగా బాపనయ్య ఇల్లు చేరినాడు. తెలతెల వారగనే....రాజభటులు హరిజనుని ఇంటికివచ్చి-"రాత్రి నగరాన కాపల తిరిగిన వానిని రాజుగారు తీసుకురమ్మన్నార"ని రాజాజ్ఞను చెప్పిరి. పొల గూరు నుండి ఉఱుకులు- పఱుగులతో వచ్చిన హరిజనుడు- విషయము తెలిసికొని, బాపనయ్య వలన ఏదైనా పొరపాటు జరిగినదేమోనని భయ పడి, వణుకుతూ...తడబడే అడుగులతో తనయునితో రాజసభ చేరినాడు.

రాజునకు- ఆ బాలునిలో అనిర్వచనీయమైన అద్భుతశక్తి సంపన్నత గోచరిస్తుంది.

"ఎవరీబాలుడ"న్న రాజుమాటకు ఆ నగర సంచారి- రాత్రి నగర దండోరా వేసిన వాడనీ, లేక లేక కలిగిన బిడ్డడనీ, ఇక ఇటువంటి పొరపాటు ముందు జరుగనీయననీ, ఈ తప్పు క్షమించమని అంటాడు. అప్పుడు రాజు "ఓయి పిచ్చివాడా! ఈతని వలన- ఏ దోషము జరుగలేదు. ఈతడు అసాధారణ మేధావి. చిన్న చిన్న శ్లోకాలలో... గొప్ప వేదాంత రహస్యాలను- పండిత-పామర జనరంజకముగా రాత్రి నాలుగు కూడలులలో చెప్పినాడు" అంటూ బహుమానముగా బాపనయ్యకు రతనాలమూట నందిస్తాడు. ఆ మూటను తండ్రి కీయబోగా తీసికోడు.

బాపనయ్య- సంతోషముతో తండ్రికంటె ముందుగా ఇంటికిచేరి, తల్లికి- ఆనందోత్సాహాలను కలిగిస్తూ....ఆమెకు రాజబహుమానము నందిస్తాడు. పట్టరాని ఆనందములో- ఆమె భర్త, చెప్పిన మాటను మఱచి, మూట తీసికుంటుంది. మరుక్షణము- ఋణముతీరిపోగా.... బాపనయ్య హఠాత్తుగా కుప్పకూలి, వైకుంఠనాథునిలో లీనమౌతాడు.

కాన.... ఓ చదువరులారా! ఆశకు బందీలుకాక.... మనోనేత్రముతో ముందుకు సాగండి. ఋణానుబంధమైన ఈ మాయా సంసారము నుండి విముక్తులు కండి. ఋణశేషము, అగ్నిశేషము, శత్రుశేషాలను మిగల్చరాదు. మరణించే వఱకూ ఉండే- దేవ, ఋషి, పితృఋణాలను అహాతహము అహమహమికతో తీర్చండి! జీవన్ముక్తులు కండి!!

## ముందుచూపు

ప్రతి మనిషికి ముందుచూపు అవసరము. ఒక విషయాన్ని గుఱించి, దాని మంచి-చెడులను గుఱించి ముందుగా చేసే ఆలోచనా విధానాన్ని ముందుచూపు అంటారు. దీనిని గుఱించి మహాభారత

ములో- మనిషికి ముందుచూపు ఎంత అవసరమో, అది లేనివాడు క్షణ క్షణము చావు-బ్రతుకులమధ్య ఎలా కొట్టుమిట్టాడవలసి వస్తుందో....వ్యాస భగవానుడు వివరించి చెప్పాడు.

ఒక చెరువులో- "దీర్ఘదర్శి, ప్రాప్తకాలజ్ఞుడు, దీర్ఘసూత్రుడు" అను పేర్లుగల చేప లున్నాయి. పేర్లకు తగ్గట్టుగా....దీర్ఘదర్శి " ముందుచూపు గలవాడు. ప్రాప్తకాలజ్ఞుడు-సమయానుకూలవర్తి. దీర్ఘసూత్రుడు-మందుడు. ఆ చేపలు, హాయిగా- సుఖ-సంతోషాలతో మిక్కిలి స్నేహముగా ఉంటున్నవి.

వేసవికాలము రాగా.... చెఱువులోని నీరు ఇంక జొచ్చినది. కొందఱు జాలరులు వచ్చి- "త్వరలో మనము ఈ చెఱువులోని చేపలను పట్టవచ్చు" అనుకొని వెళ్ళారు.

ఇది గమనించిన దీర్ఘదర్శి తనవారితో "మిత్రులారా! చెఱువులోని నీరు ఇంకుతున్నది. కాన.... మనము మరోచోటికి పోవుట మంచిది. లేకుంటే ... నీరు తగ్గగానే జాలరులు వలపన్ని, మనలను హింసింతురు" అన్నది.

ఆ మాటలు- ప్రాప్తకాలజ్ఞ, దీర్ఘసూత్రులకు రుచించలేదు. "ఎప్పుడో రానున్న అపాయానికి ఇపుడు వగచనేల? ఆపదవస్తే-గిస్తే....అప్పుడే చూచుకోవచ్చు"అన్నవి. వారి మాటల నాలకించి, "తనదారి తాను చూచు కొనుట మంచిద"ని దీర్ఘదర్శి వారిని వీడి, అపాయము లేని మరోచోటుకి వెళ్ళినది కాలక్రమాన- ఎండ వేడిమికి సరస్సు ఇంకినది. జాలరులు అనే రకాలైన సాధనాలతో మడుగును చుట్టుముట్టారు.

ప్రాప్తకాలజ్ఞుడు- ప్రాణాలపైన ఆశవీడి, వలత్రాళ్ళను తానే ప కొనివలలో చిక్కినవానివలె నటించి, మంచినీటిలో ముంచగనే... త్రా వీడి నీటిలోకి చేరి, ప్రాణాలను కాపాడుకొన్నాడు.

ఇక దీర్ఘసూత్రుడు- దీర్ఘదర్శివలె ముందుగ మేల్కొనక....ప్ర కాలజ్ఞునివలే-సమయానికి తగిన ఆలోచన చేయలేక.. .వలలో తగుల్కొ ప్రాణాలను కోల్పోయాడు.

ప్రతివారు- ముందుచూపుగలవారై, ఆపదలనుండి బయటపడ ఆనందమయ జీవనమును గడపాలి. అంతేకాని.... ప్రాప్తకా

వలే సందేహాస్పదమైన బ్రతుకును- బ్రతుకరాదు. దీర్ఘసూత్రుని వలే- మందబుద్ధులై, ప్రమాదాలకు లోనుకారాదని గ్రహించాలి.

## ఆశ-అగ్నితో సమానము

సంస్కృతములో- అగ్నిని "అనలము" అంటారు. న+అలము= అనలము. "అలము" అంటే "చాలును" అని అర్థము. "న" అంటే "కాదు" అని. కాగా.. "అనలము" అంటే "చాలనిది" అని. ఎంతకాలినా... అగ్ని చల్లారదు. "ఇంకా ఇంకా ఎక్కువగా కాల్చాల"నే అంటుంది. ఆశలు కూడా అంతే. ఎంతగా కోర్కెలు తీరినా సంతృప్తి ఉండదు. ఒకటి అందితే ....మరొకటి అందాలని; అది అందితే.... మరేదో లభించాలని! ఇలా అంతూపొంతూ లేకుండా ఉంటాయి కోరికలు. కాన.... ఆశను వీడాలి. అందుకే పెద్దలన్నారు "ఆశాపాశము తా కడున్నిడువు లే దంతంబు"అని ఆశను-పాశముతో పోల్చారు. ఆశలేనివాడు- అధిక సంతోషి.

అగ్నివంటి ఆశను గూర్చిన- విష్ణుపురాణ కథ: "సౌభరి" అను తాపసోత్తముడు- నీటిలో మునిగి, చాలకాలముగా తపము చేయుచుండెను. నిమీలిత నేత్రుడైన ఆ తపస్వి-ఒకనాడు కనులు తెఱచిచూడగా ....ఎదుట మీనదంపతులు తమ సంతతితో అటునిటు ఆనంద డోలికలలో ఊగుచు తిరుగుటను చూచెను. ఆ అనురాగ రసమయ మత్స్యయుగళ విహారము- తాపసికి మదనతాప భావనలు తీయగ తగులగా.... సంసారముపైకి మనసు పురిగొల్పెను. అందుకే "ఇనుప కచ్చడాల్ గట్టుకొను నట్టి మునిముచ్చులెల్ల తామరసనేత్ర లిండ్ల బందాలు గారె" అంటారు. వెంటనే నీటినుండి వెల్వడి, మాంధాత చక్రవర్తిని చేరి- "నీ కుమార్తెల నందరి నాకిచ్చి వివాహము చేయుమ"నెను.

మాంధాత ఆలోచనలో పడెను. "మహర్షుల మాట కాదనరానిదే. కాని.... సుకుమార కుమార్తెలు వికృతాకార సౌభరిని పరిణయమాడుదురా? ఏమో!, ఏమగునో!! ఈ పరిస్థితి తనను ఇఱుకాటములో

పడవేసినది! ఆలోచించిన మాంధాత "మునివరా! నా కుమార్తెలకిష్టమైన నా కభ్యంతరము లేదనె"ను. వెంటనే ఆ తాపసి నవకోటిమన్మథ సుందరాకారుడై, అతిలోక లావణ్య రూపధారియై రాజకుమార్తెలను చేరెను. వారును సుందర రూపుని, మదనుని బోలినవానిని చూచి- పరిణయమాడ తొందరపడిరి.

వైభవముగా వివాహము జరిగినది. సౌభరి తన తపశ్శక్తితో నందరికీ- అందాల అద్దాలమేడలను, సరోవర-ఉద్యానవనములను నిర్మించెను. సమస్త రతిక్రీడలతో- ఆ రాజకుమార్తెలతో కామ సుఖాలను అనుభవించెను. కానీ....సంతృప్తి కలుగలేదు. కోరికలకు అంతు లేకుండెను.

అపు డా మౌని- కనులు తెఱచి "సంతానము కావాలనుకొన్నాను. సంతానము కలిగినది. వారి సంతానము చూడాలనుకొన్నాను. అలాగే జరిగినది. మళ్ళీ వారి సంతానాన్ని చూడాలని కోరిక. అహా! ఆశ ఎంత బలీయమైనది. 'ఆశయా బద్ధతే లోకః' ఆశ అనే మాయతో ఈ లోకము బంధింపబడినది కదా!

దృష్ట్వా స్నుతా స్తత్ర నయప్రసూతిం
ద్రష్టుం పునర్వాంఛతి మేంతరాత్మా॥.

ఇక....తపశ్శాలినైన నేనే- మాయకులోబడి, సంసార జంజాటములో చిక్కుపడితిని గదా!" అని మరల జ్ఞానవంతుడై, తపస్సున కేగెను. కాన....ఆశనువీడి, ఉన్నదానితో సంతృప్తిని పొందువాడే-పరమపదమున చేర తగినవాడు!

# నిత్యము స్మరింపదగిన స్తోత్రము

మన హిందూ సంప్రదాయ ప్రకారము- మానవుని మనుగడపై నవగ్రహాల పెత్తనము అధికము. జన్మించినది మొదలు-మరణించు వరకు సూర్యుడు, చంద్రుడు మొదలుగా గల తొమ్మిది గ్రహాలు- మంచో, చెడో

